JAGATI Rs. 5-00 Deepavali 1991

37th Year of Publication

# జగతి

ఎడిటర్ : చందూర్

424

దీపావళి - 1991

## నమస్సుమాంజలి

పండిట్ నెహ్రూ ముఖ చిత్రంగా, ప్రపంచ ప్రఖ్యాత నాట్యకారిణి శాంతారావు, బాలె నృత్యం, లోపలి కవరు పేజీలుగా, ఆచంట జానకిరామ్, కొడవటిగంటి కుటుంబరావు, వియస్ శర్మ, కొమ్మూరి పద్మావతీదేవి, వన శ్రీల రచనలతో 'జగతి' ప్రారంభ సంచిక, 1955 నవంబరులో వెలువడింది. రెండవ సంచిక ముఖచిత్రం బుల్గానిన్ ; లోపలి కవర్లు : యమ్మెస్ సుబ్బలక్ష్మి, 'పొయిట్రీ' పత్రిక ఎడిటర్ షాపెరో.... కాలగతితో అన్నిటా వచ్చినట్లే, పత్రికా రంగంలోనూ మార్పులు సహజం. ముప్ఫయ్యారు నిండి ముప్ఫయ్యేడు ప్రవేశిస్తున్న సందర్భంగా, ఆదరిస్తున్న పాఠకులకు, అభిమానిస్తున్న ప్రకటనదారులకు, ఆది నుంచీ చేయూతనిస్తున్న 'తెలుగు చలన చిత్ర పరిశ్రమ'కు, సర్వదా మా మేలుకోరే మిత్రులకు కృతజ్ఞతాభి వందనలతో మా నమస్సుమాంజలి.

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : పండిట్ నెహ్రూ

పరిశీలన

# చరిత్రలో నెహ్రూ

ప్రఖ్యాత పత్రికా రచయిత ఎమ్. చలపతిరావు, జవహర్‌లాల్ నెహ్రూకు చరిత్రలో గల స్థానాన్ని వివరిస్తున్నారు. ప్రజాస్వామిక వ్యవస్థకూ, మతాతీత లౌకిక రాజ్య స్థాపనకూ, అలీన వైదేశిక విధానానికీ సోషలిస్టు సామాజిక నిర్మాణానికీ ప్రాణంపోసి, గాంధీజీ రాజకీయ స్వప్నాలకు కార్యరూపమిచ్చిన మహనీయుడు నెహ్రూజీ.

జవహర్‌లాల్ నెహ్రూను గురించిన రచనలూ, విమర్శలూ, ఎన్ని వచ్చినా, వాటిలో సమగ్రత లోపించిందనే చెప్పాలి. ఆ విధముగా వచ్చిన రచనలలో చాలా భాగం ఆయన స్వీయచరిత్రలోని సంఘటనలను ఆధారంగా చేసుకొని రచించిన గాథలే. జీవిత గాథలను ఎంత సమర్థవంతగా రచించినా, అవి చరిత్రలనిపించుకోవు. నెహ్రూ జీవిత కాలములోనూ, ఆయన మరణానంతరం ఆయన్ను గురించిన విమర్శలు చాలా వచ్చాయి. ఈ విమర్శలన్నీ ఆయన బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనాలు. నెహ్రూ మరణానంతరం, ఏటా కొంగ్రొత్త విమర్శలు వినవస్తున్నాయి. ద్వేషరహితమైన విమర్శలను నెహ్రూ ఎంతో మెచ్చుకునేవారు. చారిత్రిక సత్యాలు పూర్వాపరాలు తెలియకుండా విమర్శలు చేయడము సబబు కాదు. కొన్ని పరిస్థితుల ఆధారంగా ఆయన నాయకత్వ పీఠాన్ని అందుకున్నారు. బాల్యంలో దేశాభివృద్ధి పట్ల, ప్రపంచాభ్యుదయం పట్ల, ఆయన విశేషాసక్తిని ప్రదర్శించారు. శ్రీ నెహ్రూ రచించిన స్వీయచరిత్ర అంతా వాస్తవిక అనుభూతులతో నిండివున్నది. నెహ్రూ కుటుంబం యొక్క దుస్తులు చలవచేయడానికి పారిస్ నగరానికి పంపేవారని ప్రచారంలో వున్న పుక్కిటి పురాణాలను ఆయన తమ స్వీయ చరిత్రలో ఖండించారు.

శరీరపుష్టి మానసికశక్తి, ధైర్య సాహసాలు, సానుభూతి, దూరదృష్టి మొదలైన లక్షణాలన్నీ ఆయనలో మూర్తిభవించే వున్నాయి. అయినప్పటికీ పై లక్షణాలు తనలో యితరులందరికి కంటె ఎక్కువగా వున్నాయని ఆయన ఎన్నడూ అనలేదు. ఈ విష

యాలలో తనను మించినవారు ఎందరో వున్నారని ఆయనకు తెలుసు. చరిత్రను గురించిన గ్రంథాలు ఎన్నో రచించినా, తాను చరిత్రకారుడనని ఎన్నడూ చెప్పుకోలేదు. ఆంగ్ల వచన రచనలో ధురీణుడైనా, తాను కవినని చెప్పుకోలెదు. తాను దేశభక్తుడననీ, జాతీయవాదిననీ లేక సామ్యవాదిననీ అనుకోలేదు. తనలోని సల్లక్షణాల ఫలితంగా, దేశ శ్రేయస్సునకు తాను ఒక సాధనంవంటి వాడినని ఆయన విశ్వాసం. ఆ లక్షణాల సంలీనం ఫలితంగానే, ప్రపంచంలో యింతవరకూ కనివిని ఎరుగనంతటి ఉత్తమ నాయకుడుగా ఆయన భాసించాడు. తనలోగల యీ లక్షణాలను ఏ విధంగా, ఏ లక్ష్యసాధనకు ఆయన వినియోగించాడన్నదే ప్రశ్న.

నెహ్రూ అంతటి ఉత్తమ సాధనం వంటి వాడైతే, ఏ యుగంలోనైనా ఆయన సాధించలేనిది వుండబోదు. ఫ్రెంచి విప్లవం, అమెరికన్ విప్లవం, రష్యన్ విప్లవాల రోజులలో, ఆ విప్లవాలకు నాయకత్వం వహించేవారు. ఆయన గాంధిశకం వారు కాబట్టి గాంధి విప్లవ సిద్ధాంతమే ఆయనకు వంటపట్టింది. మొదట్లో ఆయన గాంధి సిద్ధాంతాలతో ఏకీభవించక పోయినా, కాలక్రమేణా గాంధీజీని, గాంధి సిద్ధాంతాలనూ నెహ్రూ ఆకళింపు చేసుకున్నారు.

దేశాభ్యుదయానికి గాంధి, నెహ్రూలలో ఎవరు ఎంతగా తోడ్పడ్డారన్న విషయం స్పష్టముగా ఎవరూ చెప్పజాలరు. ఆ విషయాన్ని గురించి ఎంతో సవివరమైన పరిశీలన జరగవలసివున్నా, నెహ్రూ విప్లవవాది. గాంధి సనాతన సిద్ధాంతాలపట్ల పక్షపాతం కలవారంటే ఎంత సబబో, గాంధి విప్లవవాది. నెహ్రూ సనాతన పక్షపాతి అనడము అంతే సబబు. భారతదేశంలోని విప్లవ పరిణామానికిద్దరూ బాధ్యులే. 1930 లో బీహారులో కాంగ్రెస్ మహాసభ జరిగినప్పుడు నెహ్రూ తాను సోషలిస్టుగా, రిపబ్లికన్‌గా ప్రకటించారు. అప్పటినుంచి భారత స్వాతంత్ర్యోద్యమంతో ఆయనకు సన్నిహిత సంబంధము ఏర్పడింది. గాంధీజీ ఆనాడు ఆమోదించిన ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమం నెహ్రూ రూపొందించినది. అంతర్జాతీయ పరిస్థితిని గురించి గాంధీజీ ఎక్కువ పట్టించుకోలేదు - నెహ్రూ దృక్పథాన్నే ఆయన బలపరిచారు. ప్రపంచ యుద్ధం పట్ల, యుద్ధానంతరం కూడ కాంగ్రెస్ విధానాలను నెహ్రూ దృక్పథం దృష్ట్యా తీర్చిదిద్దడం జరిగింది. ఈ ఇద్దరి నాయకుల మధ్యా 1930 నుంచి 1948 వరకూ అంతటి సన్నిహిత సంబంధాలున్నప్పుడు, గాంధీ నిర్యాణం తర్వాత ఆ, విధానాలను బలవంతంగా వేరుచేయబూనడం సమంజసం కాదు.

ఇటీవలి భారత దేశచరిత్రను గురించిన కొత్త రకం చర్చలు వినవస్తున్నాయి. ఆ విధమైన వాటికి అంతులేదు. గాంధీజీ అసలు జన్మించని

వుండకపోతే ఏం జరిగేది ? బ్రిటిషు వారు 1920 లోనో, 1930 లోనో, పోనీ 1942 లోనో మనకు స్వాతం త్ర్యం యిచ్చి వుంటే, ఏం జరిగి వుండేది ? - అన్న ప్రశ్నలు అడగ డంలో అర్థము లేదు. దేశ విభజన బాధ్యత గాంధీజీని మినహాయించి మిగతా కాంగ్రెస్ నాయకులకు అంట గట్టడం సబబు కాదు. పాకిస్థాన్ ఏర్ప ర్చడాన్ని గాంధీజీ వ్యతిరేకించ వల్సింది. కాని వ్యతిరేకించలేదు. 1946 నాటి పరిస్థితి ఎల్లా వుందంటే, ఇంటాబయటా అనేక పరిస్థితులవల్ల దేశాన్ని విభజించి పాకిస్థాన్‌ను ఏర్ప ర్చడమా లేదా అన్న ప్రశ్నే మిగిలి పోయింది. స్వాతంత్ర్యం ఎంతో అమూల్యమైనదని కాంగ్రెస్ భావించి, ఆ స్వాతంత్ర్యాన్ని తీర్చిదిద్దుకోడానికి స్వతంత్రం వుండాలనుకున్నారు.

గాంధీజీ, సర్దార్ పటేల్‌ల మధ్య భేదాభిప్రాయాలకు ఎక్కువ ప్రాధాన్యం యిచ్చారు. 1946 సెప్టెంబరులో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడినప్పటి నుంచీ, 1950 లో సర్దార్ పటేల్ మరణించే వరకూ పూర్తిగా తన నాయకత్వాన్నే, కాంగ్రెస్ చేత నెహ్రూ ఆమోదింప చేయలేక పోయారు. నెహ్రూ, పటేల్‌ల దృక్ప థాలలో తేడాలున్నాయి గాని వ్యక్తి గతంగా వచ్చిన భేదాభిప్రాయాలు కావు. ఇరువురూ అగ్రనాయకులే.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించినా, దేశ విభజన అనే బహు గడ్డు సమస్య ఎదురయింది. పైగా బ్రిటిషు వారు పోతూ పోతూ, ఇష్టం వచ్చిన విధాన వ్యవహరించే స్వేచ్ఛనిస్తూ, దాదాపు ఆరువందల స్వదేశీ సంస్థానా లను విడిచి వెళ్లటంతో దరిమిలా ఎన్నో విభజనలు జరిగే ప్రమాదం కూడా ఏర్పడింది. ఏది ఏమయినా, దేశాన్ని ఒకానొక నిర్దిష్ట మార్గాన నడిపించగల అవకాశాన్ని జారవిడుచు కోవడమయింది. అయితే ఇందుకు నెహ్రూను తప్పుపట్టడం పొరపాటు. ఎన్నో ఇబ్బందులు ఉన్నప్పటికీ భారత వైదేశిక విధానానికి పునా దులు వేశారాయన. రాజ్యాంగ చట్టం లో ఉదాహరించిన సామాజిక ఆర్థిక ధ్యేయాలకు రూపకల్పన చేశారు. స్వదేశీ సంస్థానాల ఏకీకరణకు దోహ దం చేశారు. కాంగ్రెస్ నుంచి వైదొ లక్కపోవడం ద్వారా, నెహ్రూ సోష లిస్టులకు అన్యాయం చేశారా, లేక రాజ్యాంగ నిర్ణయసభలో పాల్గొ నేందుకు సహితం నిరాకరించటం ద్వారా వారే నెహ్రూను దగా చేశారా అన్నసంగతి పరికించదగింది. అయితే కాలగతే ఈ ప్రశ్నను నెహ్రూకు అనుకూలముగా నిర్ణ యించింది. వేర్వేరు విధానాలను అమలు జరిపేందుకు అను వయిన, బ్రహ్మాండమయిన సాధనం కాంగ్రెస్, అని ఆయన గ్రహించారు. లోపాలెన్ని ఉన్నప్పటికీ, ఆ సంస్థను, కొన్ని ప్రాతిపదిక ప్రయోజనాల సాధ నకుగాను వినియోగించుకున్నారు.

గాంధీజీ ఆదర్శాల కనుగుణంగా నెహ్రూ అనుపమానమైన ధైర్య సాహసాలను ప్రదర్శించారు. ఎన్నో సార్లు, తూర్పు పాకిస్థాన్‌లో అల్ప సంఖ్యాక వర్గాలవారు ఘోరమయిన అన్యాయాలకు గురి అవుతూండగా, పాకిస్థాన్‌తో యుద్ధం ఇక తప్పని సరి అని భావించిన తరుణంలో సహితం, దెబ్బకు దెబ్బ తీయవలసిందే అన్న అభిప్రాయం అత్యధిక సంఖ్యాకులు వ్యక్తపరిచినా కూడా చలించక తుపానుకెదురు నిలిచి, ధైర్యంగా, పాకిస్థాన్ నాయకులతో సంప్రదింపులు జరిపారు. ఆ సంప్రదింపుల ఫలితమే నెహ్రూ - లియాకత్ ఆలీ ఒప్పందము. భారత పాకిస్తాన్‌ల మధ్య సమస్యలు కొన్నిటికి పరిష్కారం కుదరకపోయినా కూడా ఆయన చేసినది పొరపాటు అనలేము. కాశ్మీరు విషయంలో, యదార్థానికి ఆయన ఇదమిద్ధంగా చేసినది ఏమిటో ఏమిచేసి ఇంతవరకూ నిర్ధారణ కాలేదు.

మనోవాక్కాయ కర్మలా ప్రజా సేవకే తమ జీవితాన్ని ధార పోశారు నెహ్రూ. ఇంత దీక్షానిరతితో, శక్తి

వంచన లేకుండా పాటుపడినవారు. చరిత్రలోనే బహు కొద్దిమంది కనబడతారు. ఆయన జీవితకాలంలో, రెండు రకాలయిన విమర్శలు వినవచ్చేవి. ఆయన 'నెహ్రూ' కాకుండా అన్యులెవరిగానైనా అయివుంటే బాగుండేది అన్నది ఒక విమర్శ. అయితే ప్రజలు మాత్రం, 'నెహ్రూ'గానే ఆయనను ఆది నుంచీ అభిమానించేవారు - ఆయన మరొకరు కావటం వారికి ఇష్టంలేదు. ఆయన చేసినది కాక, ఇంకా ఎంతో చేయవలసింది ఉన్నది రెండవ విమర్శ. అయితే వేర్వేరు పరిస్థితులలో ప్రజలు ఏదయితే చేయనిచ్చారో, దానిని మాత్రమే ఆయన చేయగలిగారు.

స్వతంత్ర భారతదేశానికి అవిచ్ఛిన్నంగా, 17 సంవత్సరాలు ప్రధానిగా ఉండి శ్రీ నెహ్రూ మన ప్రజాస్వామిక వ్యవస్థకూ, మత ప్రాధాన్యరహితమైన లౌకిక ప్రజారాజ్యానికీ, సోషలిస్టు వ్యవస్థకూ వైదేశిక విధానానికి గట్టి పునాదులు వేశారు. ఆయన విధానాలను ఎవరైనా తప్పు పట్టవచ్చు. అయితే, క్రమక్రమంగా ఆయన, ఈ దేశ స్థితిగతులదృష్ట్యా ప్రజాస్వామిక వ్యవస్థ తప్పనిసరి అని ప్రజలు గుర్తించేట్టు చేశారు. సోషలిస్టు పద్ధతి సామాజిక వ్యవస్థ సహితం తప్పనిసరే నన్న విషయాన్ని ప్రజలచేత గ్రహింప చేశారు. జనాభాలో బహు సంఖ్యాకులు నిరక్షరాస్యులై ఉండగా, వయోజనులందరికీ వోటింగ్ హక్కు ఉన్న తరుణంలో మూడుసార్లు, సార్వత్రిక ఎన్నికలు జరిపించి, మన దేశంలో కూడా ప్రజాస్వామికం అమలు జరగగలదని నిరూపించారు.

ప్రణాళికాబద్ధమయిన ప్రగతి సాధనను ఈనాడు మనమంతా ఆమోదించామూ అంటే, ప్రణాళికల పద్ధతిని-ఎందరు వ్యతిరేకించినా, నెహ్రూ, అచంచలమయిన విశ్వాసంతో ఆ విధానాన్ని సుస్థిరంగా నెలకొల్పడమే అందుకు కారణం. ఇక ఈనాడు ప్రణాళికా బద్ధంగా శ్రేయోభివృద్ధిని సాధించాలనే సూత్రాన్ని వ్యతిరేకించేవారెవరూ లేరు. మనదేశములో ఉన్న స్థితిగతుల దృష్ట్యా, సోషలిస్టు పద్ధతిని ప్రణాళికలను రూపొందించి అమలు జరపడం అవసరమని ఆయన గట్టిగా నమ్మారు. సోషలిజం అంటే ఏమిటో క్షుణ్ణంగా బోధపరుచుకునే ఆయన, అందుకు పూనుకున్నారు.

తన తర్వాత, ఎవరు అధికారము స్వీకరించాలి - అన్న విషయమై ఆయనకు పట్టింపులు వుండేవి కాదు. సామ్యవాద పరమయిన విప్లవాన్ని దేశంలో సుస్థిర పరచగలిగిన వ్యక్తి అయితే చాలునని భావించేవారు. ప్రతి ప్రణాళిక, ఈధ్యేయ సాధనకు జరిపే మహాయాత్రలో ఒక మైలు రాయిగా పరిగణించారు. తీరా చనిపోయే సమయానికి, ఆయనకు ప్రజలు, తమకు నచ్చిన నూతన ప్రధానిని, స్వయంగా నిర్భయముగా ఆత్మవిశ్వాసంతో ఎన్నుకోగలరనే ఆశ ఏర్పడింది.

తాను కాంగ్రెస్‌కు చెందినవారే అయినా, పార్టీ రాజకీయాలకే కట్టుబడి పోయినవారు కాదు నెహ్రూ. కాంగ్రెస్ కంటె, దేశమే ముఖ్యమని భావించే వారు.

భారత దేశంలో ప్రజాస్వామిక వ్యవస్థ, దిగులులేకుండా సాగి పోయేదే. రూపు రేఖలలో మార్పు లంటూ రావచ్చు. కాని, దానికి సంబంధించిన ప్రాతిపదిక సూత్రాలు మాత్రం, ప్రజల మనస్సుల్లో గాఢంగా నాటుకుపోయినై. సామాజిక, ఆర్థిక రంగాలలో ఏ పరిణామాలకయితే నెహ్రూ, నిర్విరామంగా శ్రమించారో, వాటిని ఎవరూ ఆపజాలరు. ఈ దేశంలోనూ విదేశాలలోనూ కూడా, శాంతిస్థాపనకై పాటుపడ్డారాయన. శాంతియుత సహజీవనం ఆయన లక్ష్యం. ఇలాంటి కృషి చేసిన భారతీయ నాయకులు మరికొందరు కూడా లేకపోలేదు. కాని నెహ్రూ కంటె గొప్ప దేశ పునర్నిర్మాత కన్పించడం కష్టం. గాంధీజీకి సర్వదా నివాళు లర్పించేవారు నెహ్రూ; ఆధునిక. రాజ్య తంత్రానికిగల అవసరాలు తీర్చేందుకు, గాంధీజీ సూత్రాలను అన్వయించారు.

గాంధీ నెహ్రూలు ఒకరి సరసన ఒకరు నిలబడుతారు, గాంధీ పక్కనే నెహ్రూ స్థానం – వారిరువురినీ విడదీయటం కష్టం.

—ఎమ్ చలపతిరావు
'జగతి' - జూన్ 1967

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము. చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600 004

బల్గేరియన్ కథానిక

# విటమినులు

ఎన్నోవింతలు చూస్తున్నాం మనం. మనిషి దేహానికి సంబంధించిన శాస్త్రవిజ్ఞానం రోజుకొక చిన్న పుస్తకాన్ని బయట పెడుతూంది. రచయితగారి ఫొటో, చిన్న పీఠికా, వగైరా హంగులతో వెలువడే ఈ పుస్తకాల పేర్లు 'ఊపిరి' 'జీర్ణం' - 'నాడీమండలం' - 'రక్త ప్రసరణము' అని వుంటుంటాయి.

దేహసంబంధమైన రసాయనిక శాస్త్రంతో ఒక సైంటిస్టుకు గల సంబంధం ఫలితంగా పుట్టిందొక శాస్త్రం. అదే 'విటమినుల' శాస్త్రం.

విటమినులంటే ప్రాణ శక్తులన్న మాట. విటమినులు లేనిచోట ఆరోగ్యం వుండజాలదు.

ఈ విటమినులనేవి చూశారూ, కంటికి కనుపించవు, వీటిని సూక్ష్మ దర్శినిలో చూడాలి. అట్లా చూచినపుడొక్కొక్కసారి ఒకొక్క విధంగా కనపడ్డం మూలాన్ని వాటికి ఏ, బి, సి, డి - అంటూ పేర్లు పెట్టారు.

'హెచ్' గ్రూపుకు చెందిన విటమిను రూపం చాలా తమాషాగా వుంటుంది; ప్రూఫులు దిద్దే వారు పేరాగ్రాఫులకు గుర్తు పెడతారే అటా వుంటుంది. ఈ విటమిను పంది తోకలా వుంటుందిమరి.

మరొక విటమిను విషయం మరిచి పోకూడదు మనం. అది 'ఎల్' గ్రూపుకు చెందినది. ఈస్టర్ సమయపు నానురొట్టెలా వుంటుంది. కుజ గ్రహానికి జ్యోతిష్కులు పెట్టే గుర్తులా వుంటుందది.

మనిషి తినే ఆహారాలన్నిటిలోనూ - అనగా జున్ను, కేకు, కట్లెట్, బీరూ, వైనూ, పండ్లు, క్రీము - వగైరాలన్నింటిలోనూ వుంటుంది.

శాండోలాటి శరీరం కావాలని నాగరికుడు కలలు కంటుంటాడు. ఉదయం నుండి సంధ్యదాకా ఎండ సుఖాన్ని అనుభవిస్తూ, ధనవంతులకు వచ్చే కీళ్ళ వాతపు అదృష్టం పట్టని - ఆఫ్రికన్ నీగ్రోను చూచి అసూయ పడతాడు. ఆరోగ్యం ఎప్పుడు పాడవుతుందోనని సదా భయపడే ఆధునిక మానవుడు, మరణాన్ని కాస్త దూరంగా వుంచడానికి సాయపడేవి ఆటలూ, విటమినులూను.

ఆటలకయితే కాస్త విరామం చిక్కుతుంది. కాని, విటమినుల విషయంలో ఇది కుదరదు.

శరీరానికి ఇంత ముఖ్యమైన విటమినులు - మూడు కాదు, నాలుగుసార్లు తిండి ఆరగించినా లభించవు కదా.

కనుక - ఇందువలన తేలిన దేమిటంటే, విటమిన్లకోసం కేవలం ఆహారంలోనే వెతికితే చాలదు.

వాటికోసం చిత్రకారుల కళాఖండాలనూ, రచయితల రచనలనూ, సంగీతకారుల పాటలను ముఖ్యంగా నాట్యగీతాలను గాలించాలి.

ఇక్కడ మనం సాహిత్యంలో లభించే విటమిన్లను పరిశీలిద్దాము. అవి ఎర్ర, తెల్ల కణాల సంఘర్షణలో ప్రధాన పాత్రను నిర్వహిస్తాయి. ఈ విటమినుల ప్రాథమిక స్వరూపము, లిట్మస్ కాగితముమీద వాటి ప్రభావము - వంటి విషయాలను చర్చించడము మానేసి బ్రహ్మాండమైన వాటి ఫలితాల గురించి మీకో చిన్నకథ చెబుతాను వినండి.

కొన్ని నెలల క్రింద - మా మిత్రుడొకరిని ఇతోధికంగా విటమినులుండే నవల రాయమని, ఒక ప్రచురణకర్త అడిగాడు. అందుకోసం వందా వెయ్యీ కాదు, - ఒక లక్ష ఇస్తామన్నారు.

ఇహ మా మిత్రుడేమో అంతగా వున్నవాడేంకాదు - అంచేత ప్రచురణ కర్త అడగ్గానే ఒప్పేసుకున్నాడు. నిజమే కదా అంతటి డబ్బు ఇస్తానంటే విటమినులేమిటి ప్లేగు క్రిములు నింపిన నవల రాయమన్నా రాస్తారు.

అంచేత మా మిత్రుడు మూల గదిలో కెళ్ళి తలుపు మూసుక్కూచుని 'పాట్' కోసం కుసీ పటసాగాడు. మరి 'ప్లాట్' లేనిదే నవలంటూ ఏడవదు కదా.

ఇలా కొన్ని రోజుల పర్యంతం తెగ ఆలోచించి, ఆ నవల ఏదో జాతీయమైన దృక్పథం కలిగి వుండాలి - అన్న నిర్ణయానికి వచ్చాడు మా మిత్రుడు. జానపద జీవితం మీద నవలయితే అందులో వున్నన్ని విటమినులు ఇంక దేనిలోనూ వుండవు. అలాటి నవలలో నయితే ఎండుగడ్డీ, అవులు, గొఱ్ఱెలు, పాలు, వెల్లుల్లిపాయలు - వీటిగురించి ప్రసక్తి వుంటుంది కదా....

సరే, రచయిత చకచకా రాసి పారేయ సాగాడు. అదేం ప్రతిభో కాని రాసిన దానిని మళ్ళీ ఒక్కసారి చూడకుండా రాసుకుపోయే వాడు, దిద్దడం అనేది అసలు లేదనుకోండి. అసలు ఆ రచయిత గురించి ఇది చెబుతారు. అతడింకా ఏడాది బిడ్డగా వుండగా ఒకనాడు, - తన మంచం మీద నుండి దిగి - తన దొడ్డికాళ్ళతో చకచకా నడిచి - చాలా మంది అతిధులు వాళ్ళూ కూచున్న గదిలోనికి వచ్చేసి, అపళంగా అందరూ ఆశ్చర్యపడిపోయేలా - ఒక పద్యం చదివేశాడట.... అసలు అదే ఆ బిడ్డ నోటనుండి వెలువడిన మొదటి మాటలు! ఇహ చూచుకోండి .... అక్కడ నుండి పూర్వజన్మ నుండి ఆత్మ ఈ జన్మలోకి రావడం అనే సిద్ధాంతం మీద వేడి చర్చలు సాగాయి. కాని సాహిత్య విమర్శకులు ఈ సిద్ధాంతాన్ని అవతలకు

తోసి పారేసి - అపూర్వమయిన బాలసరస్వతి రూపం ఈ అబ్బాయి - అని నిర్ధారించేశారు.

సరే 16 దినాలలో 314 పావు తావుల నవల పూర్తయిపోయింది.

అహా. ఏమా శైలి! ఏమా రూప కల్పన - ఏమా మేధాసంపతి! ఓహొహొహొ!

ఈ నవలను చదువుతుంటే మీ పరిసరాలను అట్టే మరిచిపోతారు. క్రమేపి మీ గది చక్కటి పచ్చిక బయలై పూల మొక్కలు నవ్వుతాయి. మీ పుస్తకాల షెల్ఫు కంచెలా అవగా, వాని మీద పెద్ద గుమ్మడి కాయలు కాస్తాయి. అద్దంలో గనుక ఒక్కసారి చూశారంటే - అలా ఠీవిగా మెడవంచి, నవ్వుతున్నట్లు మొహం పెట్టిన దూడ కనుపిస్తుంది.

ఈ నవలను చదివేసి - అలా ఒక్కసారి వీధిలోకి వెళ్ళండి, మిమ్మల్ని చూచిన మిత్రులు విస్తుపోతారు.

'అరెరె! బాగా ఒళ్ళు చేశారే ఎక్కడన్నా విశ్రాంతిగా సెలవు మీద వెళ్ళి వచ్చారేమిటి?' అని అడుగు

అపుడు మీరు ఏం చేస్తారు ? ఒక నవ్వు నవ్వేసి ఆ అద్భుతమైన, బ్రహ్మాండమైన, గొప్ప నవల పేరు, దాని రచయిత పేరు చెబుతారు. అం

నవల ప్రచురింపబడి, బజారులోకి వచ్చింది. ఏదన్నా తమ దగ్గిరి కొస్తే బాలు చీల్చి చెండాడేద్దామని - కలాలకు కొత్త పాళీలు తగిలించుకుని మరీ కూర్చున్న విమర్శకులు ఆ నవలను పోటీలుపడి ప్రశంసించ సాగారు.

ఒక్క వారంలోగా 935 సమీక్షలు వచ్చాయి. ఇహ పత్రికలో చోటులేక ఈ సమీక్షలు ట్రాము కిటికీలపైన, కాఫీహోటళ్ళ గోడలపైన కనపడసాగాయి. ఆఖరికి కరపత్రాలుగా అచ్చువేయించి వేలకొలది జనానికి పంచి పెట్టారు.

కేవలం సమీక్షకులే కాదు, అక్షరం ముక్క తెలిసినవాడల్లా ఆ అద్భుతమైన పుస్తకం గురించి ఏదో

ఒక ముక్క రాయసాగారు. మరి దాని నిండా విటమినులుండె! ప్రతి పాఠశాలలో, ఆస్పత్రిలో, బారక్సులో, ప్రభుత్వ మున్సిపల్ ప్రైవేటు సంస్థలలో ఆ పుస్తకం చదివి తీరాలన్నారు.

నైతికంగాను, చికిత్సాత్మకంగాను దాని ప్రభావం ప్రసరించసాగింది. ఒక మూగ, చెవిటి మనిషికి మాటలు వచ్చాయి. కాని అతడి మెదడు తట్టుకోలేని కటువైన మాటలు వినవలసి వచ్చిందతడు. కాగా నవల రెండవ సారి చదివేసరికి అతడి నరాల బలహీనత సర్దుకుంది.

పిల్లలు లేని స్త్రీ - చరిత్రను సృష్టించింది. ఒక్కసారిగా ఏడుగురు పిల్లలను - ఒకబ్బాయి, ఆర్గురమ్మాయిలను కన్నది.

ఒక మంత్రిగారికి జ్ఞానోదయమయి తన పదవికి రాజీనామా ఇచ్చాడు.

ఒక ఫాదరీకి ఏసుక్రీస్తు పై నమ్మకం కల్గింది.

చాలామంది పండిత ప్రకాండులందరూ పాత టోపీలకు బూజు దులిపి, తొడుక్కొని కాఫీ హొటల్లో సమావేశమయి జానపద కళ రక్షణకై సంఘాన్ని స్థాపించారు.

ఇంతకూ రచయిత - మా మిత్రుడు ఎట్లా వున్నాడో అని అడగవచ్చు మీరు. అతడికేం, మహరాజులా వున్నాడు. గంట గంటకూ అతడి ఆరోగ్యం బాగా ఇంకా బాగా అవుతూంది; శరీరం పటిష్ఠం అవుతూంది. ఇదంతా కేవలం అతడి పుస్తకంలోని విటమినుల వలననే కాదు, ప్రశంసలతో నిండిన సమీక్షలలో లభించే విటమినుల వలన కూడాను.

అయ్యా! ఇదండి ఆ అద్భుత గ్రంథం యొక్క కథ.... దాని ప్రతి ఒక్కటి కూడా యిపుడు మీకు లభించదు.

కనుక చూచారు కదూ ఈ సైన్సు అనేది ఎంత ముందడుగు వేసిందో! విటమినులనేవి కనుగొనబడకుండా వుంటే - జీవితం కాలమనే నిశ్శబ్దంలో చిన్న కాలువయి ప్రవహిస్తూ వుండిపోయేది.

రచయిత మనవి: సైన్సు సమావేశంలో ప్రసంగంలా ఉన్న దీనిని చదివి కాలం వృథా చేసుకున్నానని పాఠకుడు అనుకోరాదు. అతడి ఓపికకు మెచ్చుకుని రచయిత ఈ పేజీలలోని విటమినుల నెట్లా వాడుకోవాలో చిట్కాలు చెబుతాడు, తెలుసుకోండి: ప్రతి సాహిత్య ఖండంలోనూ - ఇట్లాగే పాఠకుడి మీద మంచి ప్రభావాన్ని ప్రసరించే విటమిన్లు వేలకొలది, కోట్లకొలది వుంటాయి.

అందువలన పాఠకుడిని మేము కోరేదేమిటంటే, పైకథను మళ్లీ ఒక్కసారి చదవండి. ప్రతీ పదాన్ని స్పష్టంగా పెద్దగా, కిటికీ దగ్గర నిల్చుని గాలి పీల్చి మరీ పలకండి.

—స్వెటస్లావ్ మిన్కోవ్
'జగతి' - డిసెంబరు 1967

# అమెరికన్ కథానిక

# నారాయణప

"నీకు తెలిసిన విషయాలు, ఉన్నవి వున్నట్టురాయి" అని సారా ఆర్నిజ్యుయెట్, విల్లాకేథర్‌కి, సలహా యిచ్చింది. జ్యుయెట్ వ్రాసిన కథలు ఈనాడు ఎక్కువమంది చదవక పోయినా, ఆమె పెట్టిన పరవడి చాలా మంది రచయితలు అనుసరించారు. మెయినీ రాష్ట్రంలో సత్కుటుంబీకుల యింట జన్మించిందీమె. ఆమె మొదటి పుస్తకం 'డీప్ హావెన్' 1887లో ప్రచురితమయింది.

జూన్ నెలలో సాయంత్రంవేళ, చిట్టడవిలోని చెట్లనీడలు పొడవయాయి. ఆ నీడలమధ్యగాను, చెట్టు మొదళ్ల పక్కనుంచి సూర్యాస్తమయం తళతళలాడుతోంది. ఒక బాలిక ఆవుని తోలుకుంటూ వస్తోంది; ఆమెకి ఆవు సాయం, ఆవుకి ఆమె సాయం. ఒకరి కొకరు సన్నిహితులు. తామిద్దరూ చీకటి పడక పూర్వమే ఈ అడవి దాటాలి. రోజూ వచ్చిపోయే ఆ దారి, వారిద్దరికి తొక్కినబాట. అంచేత, కళ్లు ఏ దిక్కుగా చూసినా, కాళ్లుమాత్రం ఒకే బాట వెంట తమని తీసుకుపోతాయి.

ఆ ఆవు ఏనాడూ దారి తప్పలేదు. వెనక దిగబడలేదు; కాని, దాని మనసులో - ఒక్కరోజురాత్రి ఆ పొదలచాటున దాక్కుంటే ఏమవుతుందో చూడాలని ఉండేది; ఎంతో కాలంగా గూడుకట్టుకు నివశిస్తున్న కోరిక అది. తను యిటూ అటూ కదలక, నిశ్చలంగా నుంచునివుంటే, మెళ్లోగంట మోగదనికూడా దానికి తెలుసు. ఒక్కసారి తమాషాచేస్తే ఎలా ఉంటుందో!

సెల్వియా 'కూహ్' 'కుహ్' అని అరిచేటప్పటికి, ఆవు 'మూ' అనలేదు. ఉత్తప్పుడయితే ఆవు తనతో ఈ విధంగా దాగుడుమూతలు ఆడటం సెల్వియా సహించివుండేదిగాని ఒక పక్క చీకటి పడుతూంటే, యిలాటి సమయంలోనా ఆటలు? నాలుగు వైపులా వెతకడం మొదలుపెట్టింది. బుదద గుంట పక్కనున్న పొదల చాటున గోమాత దాక్కుని వుండటం సెల్వియా కనిపెట్టి, చిరునవ్వుతో ఆమెని పల్కరించి, ఒకచింతబరికె చేత పుచ్చుకు, యింటివైపుగా తోలడం మొదలుపెట్టింది. ఆవుకి కూడా యిటు అటు పారిపోవాలని లేదు. సెల్వియాని ఆడిచేందుకు ఆ పనిచేసింది. బాటమీదకి రాగానే పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు సాగింది.

ఇంత ఆలస్య మయినందుకు అమ్మమ్మ ఏమంటుందోనని సెల్వి

యాకి మనసులో దుడుకుగా ఉంది. పొద్దున్న యింటి దగ్గరబయలు దేరింది. గొడ్డుని యింటికి తోలుకు రావడంలోని సాధక బాధకాలు అమ్మమ్మకి తెలియనివికాదు ; యిప్పు డంటే ఈ మనమరాలు వుందిగాని వెనకటిరోజులలో అమ్మమ్మే అవుని తోలుకెళ్తూండేది. చిన్నతనంకొద్దీ సెల్వియా యిటు అటు తిరుగుతూండే స్వభావంగలది అయినప్పటికి, అలా టివి చూసీ చూడకుండా వూరు కోవాలి ; పట్నంలో వుండి వచ్చిన అమ్మాయికి, ప్రకృతికి చేరువైన ఈ జీవితం ఎంతో మేలు చేస్తుంది అని అనుకునేది టిల్లీ.

సెల్వియాకి మనుషులంటే భయ మట. అమ్మమ్మకి సెల్వియాతల్లీ వాళ్లూ చెప్పారు. 'మా తోటలో మను షులు కనుపించరులే!' అని తీసు కొచ్చింది సెల్వియాని. అమ్మమ్మ గారింట్లో, అమ్మమ్మా తనూ ఒక పిలిపిల్లా, రెండు రాబిన్ పక్షులూ తప్ప యింకేమీ లేవు. ఈ వాతా వరణం ఎంతో బావుంది ; ఎప్పుడూ యిక్కడే వుండిపోవడానికి నిశ్చ యించుకుంది సెల్వియా.

ఆవూ, అమ్మాయీ ఒకరివెంట ఒకరు నడుస్తున్నారు. ఆవుకి అది మామూలు నడక అయినప్పటికీ, అమ్మాయి పరుగు పరుగున నడు స్తోంది. పిల్లకాలవ కనిపించేటప్పటికి, ఆవు నీరు తాగేందుకు ఆగింది ; అది నీళ్లు తాగుతూంటే, అమ్మాయి నీళ్లలో కాళ్లు పెట్టుకు నుంచుంది. సంధ్యవేళ ఎగిరేపురుగులు ఒక్కసారి జుయ్‌మని లేచాయి. ఆవూ అమ్మాయీ మళ్లీ బాటమీదికి వచ్చారు. పొదలమీద నున్న పక్షులు కిలకిల్లాడేటప్పటికి, సెల్వియాకి ఎంతో సంతోషమయింది. ఏదో మగత వచ్చినట్టయింది. గాలి పల్చగా పరిమళ భరితంగా ఉంది ; తనెప్పుడూ యింత ఆలస్యమయేదాకా వుండి ఎరగదు. ఇక్కడికి వచ్చి ఏడాది అయింది : పట్నంలోని రొద అలాగే ఉండి వుంటుంది ; పట్నంలో తనని ఏడిపించే ఎర్రబ్బాయి మొహం జ్ఞాపకం రాగానే, తొందర తొంద రగా యిల్లు చేరుకోవాలనిపించింది సెల్వియాకి.

ఇంతలో ఎక్కడనుంచో ఒక ఈల పాట వినిపించేటప్పటికి, ఆమె నవ నాడులూ కుంగిపోయాయి. ఆ ఈల పాట పక్షిది కాదు ; పక్షులు తన స్నేహితురాళ్లే! ఎవరో అబ్బాయి వేస్తున్న ఈల. అవుని దాని ఖర్మానికి దాన్ని వొదిలేసి, పక్కగా ఉన్న పొదల చాటుకి పోబోయింది సెల్వియా. కాని, అప్పటికే కాలాతీతమయింది. శత్రువు ఆమెని చూశాడు. ఎంతో ఉత్సా హంగా, "అమ్మాయ్, రోడ్డు యిక్కడికి ఎంత దూరం?" అని నిర్భయంగా అడిగాడు.

"చాలాదూరం," అంది తడ బడుతూ.

బుజాన తుపాకీ వేసుకున్న ఆ పొడుగాటి యువకుని వంక సెల్వియా చూడలేక పోయింది. భయంతో గడ

గడ లాడుతూ బాటమీదికి వచ్చి, ఆవుని అనుసరించింది ; అతను ఆమెని అనుసరించాడు.

"నేను పిట్టల్ని వేటాడుతూ, దారి తప్పాను. నువ్వు కనిపించడం నా కెంతో హాయిగా ఉంది. అనవసరంగా భయపడకు. నీ పేరేమిటి? ఇంతకీ ఈ రాత్రికి నేను మీ యింటి దగ్గిర ఉండవచ్చా? తెల్లారగానే వెళ్లిపోతాను" అంటూ ఆ వ్యక్తి నెమ్మదిగా అన్నాడు.

సెల్వియా మరింత భయపడింది. ఈ కొత్త మనిషిని వెంటబుచ్చుకు తనువెళ్తే అమ్మమ్మ ఏమంటుందో? ఏందారి, భగవంతుడా! యిందులో తన తప్పేమీలేదు. అతి కష్టంమీద, తన పేరు చెప్పింది.

ఆవూ, అమ్మాయీ, కొత్త మనిషీ రావడం టిల్లీ (అమ్మమ్మ) గుమ్మంలో నుంచుని చూస్తోంది. ఆవు ఒక్కసారి అంబా అని అరిచింది.

"సెల్వియా, ఏం జరిగింది? ఆవు ఎక్కడైనా దారి తప్పిందా?" అని ప్రశ్నించింది అమ్మమ్మ. సెల్వియా పెదవి మెదపక నుంచుంది; అమ్మమ్మకి ఆమె అవస్థ అర్థమవుతున్నట్టు లేదు.

తుపాకి చేత బుచ్చుకున్న యువకుడు, బుజంమీద సంచీ కింద పడేసి, టిల్లీకి వందనమర్పించి, తన బాటసారి కథ చెప్పి, ఆ రాత్రికి తను తల దాచుకునేందుకు స్థలమీయమని అర్థించాడు.

"ఈ రాత్రికి యిక్కడవుండి, తెల్లారగానే వెళ్లిపోతాను; నేను చాలా ఆకలితో ఉన్నాను; పాలు దాహంగా యిచ్చినా చాలు," అన్నాడతను.

"రోడ్డు యిక్కడికి ఒకమైలు దూరం ఉంటుంది. ఈ పూటకి నువ్వు మాకున్న దానిలో మాతో పాటు తిను. లోపలికి వెళ్ళి పళ్లాలు పెట్టు సెల్వియా" పెద్దావిడ.

పరిస్థితి చక్కబడ్డందుకు సెల్వియా ప్రాణం కుదుటపడింది; తనకీ ఆకలవు తోంది ; గబగబా పళ్ళాలు పెట్టింది.

ఈ కీకారణ్యంలో యింత పరి శుభ్రమైన యిళ్ళు ఉన్నాయా అని, ఆ యువకుడు ఆశ్చర్యపోయాడు. ఇల్లు చూపులకి పాతదైనప్పటికీ లోపల చక్కగా ఉంది. భోజనాల బల్ల దగ్గిర పెద్దావిడ కబుర్లువింటూ, చిన్నదాని కళ్ళకాంతులు అదేపనిగా చూస్తున్నాడా యువకుడు. "నెల్లాళ్ళ మధ్య యింత కమ్మటి భోజనం చేయ లేదంటే నమ్మండి," అన్నాడతను టిల్లీతో. భోజనాలై వీధి గుమ్మంలోకి వచ్చేవేళకి చంద్రోదయమయింది.

బేరీకాయల టైము యింకెన్నాళ్ళో లేదు ; కాయలు కోయడంలో సెల్వియా ఎంతగానో సాయపడు తుంది ; అప్పుడప్పుడు దారి తప్పేం దుకు ప్రయత్నించినా, తమ ఆవు ఎంతో మంచిది ; తమకి సరిపడ్డన్ని పాలు యిస్తుంది ; సెల్వియా తల్లి గురించీ, తన కొడుకు గురించీ, ఆరు గురు తన కడుపున పుడితే యిద్దరు మాత్రమే మిగిలిన సంగతీ ; యిలా తమ మంచిచెడ్డలు ఆ క్రొత్తతనితో ప్రస్తావించసాగింది టిల్లీ.

"మా అబ్బాయి కూడా, నీకు మల్లేనే తుపాకీ బుజాన వేసుకు వెళ్ళే వాడు. తుపాకీ కాల్చడమంటే వాడికి మహాసరదా. ఎక్కడున్నాడో యేమో! ఒక్క ఉత్తరం ముక్క కూడా వ్రాసి ఎరగడు. వాడినని లాభమేమిటి, రోజుల మహత్యం," అంది పెద్దావిడ.

"ఈ సెల్వియా వాడి పోలికే. అడవికి పోతే దానికి యింటి ధ్యాసే ఉండదు. అక్కడి పక్షులతో ఆడు కుంటుంది, ఉడతల్ని మచ్చిక చేసు కుంటుంది ; అది అన్నం తింటు న్నప్పుడు ఒక కంటితో కనిపెట్టక పోతినా, ఆ తినేది కాస్తా వీటికీ వాటికీ వేస్తుంది. వేటికన్నా వెయ్యిగాని కాకు లకి మాత్రం వేయవద్దంటాను. అబ్బాయి, దేశాల వెంబడి పోవడానికి పూర్వం, ఒక కాకిని పెంచేవాడు.. వింటున్నావా నాయనా, కాకిని పెంచేవాడు" అంది టిల్లీ.

అతిథి వింటున్నాడే గాని మనసు ఎక్కడో ఉంది. "సెల్వియాకి పక్షుల గురించి బాగా తెలుసునన్న మాట", అన్నాడతను. చంద్రకాంతితో కూచున్న సెల్వియా కనురెప్పల మీదకి నిద్ర వస్తోంది.

"చిన్నతనం నుంచీ పక్షుల్ని పెంచడం నాకు సరదా. నాదగ్గిర రకరకాల పక్షులున్నాయి. గత అయి దేళ్ళగా రెండుమూడు రకాల పక్షుల కోసం మహవెతుకుతున్నాను. అవి దొరికేదాకా నా ప్రయత్నం విరమించ కూడదని పట్టుదలగా వెతుకు తున్నాను," అన్నాడతను.

"ఈ పక్షులన్నిటినీ పంజరాలలో పెట్టి వుంచుతావా, నాయనా ?"

"ఎబ్బే, వాటిని 'స్టఫ్' చేసి, పదిల పరుస్తాను. నా దగ్గిర ఎన్ని డజనులు వున్నాయో చెప్పలేను. అన్నీ నేను పట్టుకున్నవే! మర్యాదగా వలలో పడితే సరేసరి, లేకపోతే కాల్చి

బుట్టలో వేసుకుంటాను. మొన్న శని వారం, యిక్కడికి కొద్ది మైళ్ళ దూరంలోనే, నాకు నారాయణపక్షి (హెరాన్) కనిపించింది. ఇది ఏవైపుగా ఎగిరిందో ఆనవాళు చూసుకుంటూ యిలా వచ్చాను. ఈ ప్రాంతంలో నారాయణ పక్షులున్నట్లు ఎవరికీ తెలియదు. ఆ తెల్లటి నారాయణపక్షి యిక్కడికి ఎలా వచ్చిందీ అని?" అంటూ సెల్వియా వంక చూశాడతను, సెల్వియాకి ఆ విషయమేమైనా తెలుసునేమో నన్నట్టు!

కాని, సెల్వియా తన కాళ్ళ దగ్గర గెంతుతున్న కప్పని పరిశీలిస్తోంది.

"నారాయణపక్షి ఫలానా అని చూసీ చూడగానే గుర్తు పట్టవచ్చు. పట్టుకుచ్చులాటి ఈకలతో, సన్నగా వుండే కాళ్ళతో, పొడవుగా కనిపించే ఈ పక్షిని గుర్తుపట్టడం చాలా తేలిక. చెట్ల పైభాగాన, చిన్నచిన్న పుల్లలతో, డేగకిమల్లే గూడు కట్టుకుంటుంది," అన్నాడా యువకుడు.

సెల్వియా హృదయం వెర్రి ఆనందంతో కుప్పిగంతులు వేసింది; ఆ తెల్లపక్షి తనకి తెలుసు; ఒకసారి తనకి దగ్గిరగా వచ్చి నుంచుంది. పసరికబయలుకి

పైగా, చిట్టడవికి ఆవలితట్టు నుంచి వచ్చిందా పక్షి. అటువైపుగా వెళ్తే బురదలో కూరుకుపోతావని అమ్మమ్మ చాలాసార్లు చెప్పింది: అంచేత తనెప్పుడూ ఆ చాయలకి పోలేదు. ఆ బురదకీ, ఆ కనిపించే చెట్లపొదకీ పైగా, సముద్రం ఉందట. తుపాను రాత్రులప్పుడు, చెట్ల సందుల్లోనుంచి చీల్చుకువచ్చే సముద్రపు హోరు వినడమే గాని, తను సముద్రాన్ని ఎప్పుడూ చూడలేదు.

"ఆ నారాయణపక్షి గూడు ఎక్కడో తెలుసుకునేందుకు, నేను తాపత్రయ పడుతున్నాను. అది చూపించిన వారికి పదిడాలర్లు యిస్తాను. ఈ పక్షి మరొకచోటికి వలస పోతోందా లేక ఏదైనా దుష్టపక్షి బారినుంచి తప్పించుకునేందుకు పారిపోతోందా? ఆ సంగతి తెలుసుకోవాలి."

టిల్లీకి ఈ మాటలు వింతగా ఉన్నాయి; సెల్వియా తన కాళ్ళ ముందు ఆడుకునే కప్పనే చూస్తోంది. ఆ పక్షిగూడు చూపించిన వారికి పది డాలర్లా? డబ్బు అంత చవకా?

మర్నాడే సెల్వియా, ఆ యువకుడూ చిట్టడివిలోకి వెళ్లారు. సెల్వియాకి నిన్నటిభయం పోయింది. అతను చాలా మంచివాడిలా కనిపించాడు. పక్షిజాతులూ వాటి మంచి చెడ్డలూ, వాటి జీవన పద్ధతులూ మొదలైనవి ఆ అమ్మాయికి వివరించి చెప్పడం మొదలెట్టాడు. అతను ఒక మడతకత్తి బహుమానంగా యిచ్చేటప్పటికి, ఆ బహుమతి చూసుకు మురిసిపోయింది ఆ అమ్మాయి. పొద్దస్తమానం భయపడలేదు గాని చెట్టుకొమ్మ మీద నున్న ఒక సంగీతపు పిట్టని అతను నేల కూల్చేసరికి ఆమె కొద్దిగా జడుసుకుంది. అతని దగ్గర తుపాకి లేకుండా వుంటే బావుండుననుకుంది. అంత యిష్టమని చెబుతూనే, ఆ పక్షులని ఎందుకలా చంపుతాడో, ఆమెకి అర్థంకాలేదు. ఈ యువకుడు బావున్నాడు; రూపసి; అంత అందమైన మనిషిని తనింత వరకూ చూడలేదు. ఆమె ఆంతర్యం లోని ప్రేమస్వప్నాలు కొంచెం కదిలాయి. ఈ అడవిలోకి ఒక వేటగాడు వచ్చాడని ఆ పిట్టలకి తెలుసు కాబోలు; అందుకనే అవి దూర దూరంగా పోసాగాయి. ఒకానొక పక్షిగానం విని, కొమ్మలూ రెమ్మలూ తప్పించుకుంటూ, వారు దాని దగ్గిరకి వెళ్ళబోయేటప్పటికి, అది కాస్తా తుర్రుమంది. సెల్వియా ఆ యువకుని వెంట తను నడిచిందిగాని, తనంతట తాను దారి తీయడానికి పూనుకోలేదు. ఆమె ముందు నడవకపోవటం వల్లనే నారాయణపక్షి కనిపించి వుండదు. సాయంత్రమయాక, యిద్దరూ ఆవుని వెంటబెట్టుకు, యింటివైపుగా నడక సాగించారు. ఇరవైనాలుగు గంటల క్రితం, ఏ ప్రదేశంలో ఉండగా ఈల పాట విని ఖంగారు పడిందో, ఆ చోటుకి తాము ముగ్గురూ రాగానే,

సెల్వియా పెదవులపై చిరునవ్వు నిల్చింది.

ఇంటికి అరమైలు దూరంలో ఒక గుట్ట వుంది; ఆ గుట్టపై ఒక దేవదారుచెట్టు వుంది. ఆ దేవదారు చెట్టు ఎన్నాళ్ళబట్టో అక్కడ ఉంది; సరిహద్దు నిర్ణయానికి గాను దాన్ని అలా మిగిల్చేరేమో తెలీదు; ఆ వృక్షానికి సమకాలికంగా వున్నవన్నీ చనిపోనన్నా చనిపోయాయి, లేదా కట్టెలవాళ్ళు కొట్టెయనన్నా కొట్టేశారు. కాని, ఈ వృద్ధ దేవదారు ఏదో కాపలా కాస్తున్నట్టుగా అక్కడ నిలబడి ఉంది. సెల్వియాకి ఆ దేవదారు గురించి బాగా తెలుసు. ఆ చెట్టు చిటారికొమ్మమీద నుంచుంటే సముద్రం కనిపిస్తుందని, చాలామంది చెప్పగా, తాను ఎన్నోసార్లు వింది. సూర్యోదయం వేళకి తను ఆ చెట్టు చిటారి కొమ్మమీద ఉండగలిగితే, నారాయణపక్షి గూడు ఎక్కడ వున్నదీ యిట్టే తెలుసుకు, తన స్నేహితుడికి చెప్పవచ్చు. ఆ చెట్టు కొసమీద నుంచి ప్రపంచమంతా కనిపిస్తుంది.

ఏమి సాహసం! ఎటువంటి వెర్రి కోరిక! మర్నాడు ఉదయానికి తెలియనున్న రహస్యం, ఆ చిన్ని హృదయంలో మోయలేనంత బరువు అయింది.

యువకుడూ, పెద్దావిడ నిద్రపోయారు గాని, సెల్వియా కంటిమీదకి కునుకు రావడం లేదు.

సాధించనున్న ఘనకార్యం ఆమెని నిద్రకి దూరం చేసింది. కళ్ళు మూసుకుంటే నిద్దరొస్తుందేమో; నిద్దరొస్తే, తెల్లారేదాకా మెలకువ రాకపోవచ్చు. సూర్యోదయానికి పూర్వమే, తను దేవదారు వృక్షపు చివరికొమ్మమీద ఉండాలి. కన్నె జీవితంలో నవ వసంతం తొణికిసలాడింది.

సన్నటి చంద్రకాంతిలో ఆ పెద్ద దేవదారు వృక్షం నిద్రోతూ ఉండగా, సెల్వియా చిన్ని దేహంలో రక్తం చకచకా పరుగులెడుతోంది. దేవదారు పక్కగా ఉన్న సిందూరపు చెట్టు ఎక్కి, దానిమీదుగా దేవదారు మీదకి పాకాలి. ఆ ప్రకారమే సిందూరపు చెట్టు ఎక్కింది మొదట. ఎంతయినా, ఆమె లేతవేళ్లూ, లేత పాదాలూ ఆ ఎక్కుతున్నప్పుడు గీరుకుపోసాగాయి. తమ నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్న దెవరా అని, ఒక ఉడుత యిటునుంచి అటు దూకింది; గూటిలోనున్న పక్షి బయటికొచ్చి ఆ వింత చూసింది; చెట్ల ఆకులు మంచు బొట్లతో బరువుగా ఉన్నాయి. చెట్లు ఎక్కడం సెల్వియాకి ఏమంత కష్టం కాదు; అది నిత్యానుభవమే! గబగబా సిందూరపు చెట్టు చివరికొమ్మలదాకా ఎక్కింది; అక్కడనుంచి జాగర్తగా దేవదారు వృక్షం కొమ్మలు అందుకుంది.

ఆ చెట్టుమీద నుంచి ఈ చెట్టు మీదికి వెళ్లడం మాటలు కాదు; తను అనుకున్న దానికంటె చాలా కష్టంగా ఉంది. ప్రాణాలు బిగబట్టి, ధైర్యంచేసి, అతినేర్పుగా రెండు చేతులా దేవదారు కొమ్మ అందుకు ఒక్క ఊగు ఊగింది - చేతుల్లో శక్తి, గుండెల్లో ధైర్యమూ ఉండటంవల్ల గాని లేకపోతే ఏమైపోయేదో! మెల్లి మెల్లిగా కొమ్మల మీదుగా పైకి సాగింది. సూర్యోదయ సమయ మైందని చెప్పేందుకు గూళ్లలోని పక్షులు కిచకిచలాడాయి. తూర్పున కాంతిరేఖ కనిపించేలోగా తను చిటారు కొమ్మ చేరుకోవాలి.

ఎంత ఎక్కినా, యింకా ఎత్తుగానే ఉంది. పెద్ద తెరచాప కొయ్యలా ఉంది. ఎంతసేపు ఎక్కినా, తరగడంలేదు. ఆ చెట్టు తొర్రల్లో నివశించే పక్షిసంతానంచేసే కలకల నాదాలకంటె, ఈ చిన్నారి ఏకాంత హృదయ గీతం ఎంతో మధురం, ఒకవంక పక్షుల పాట - మరొకవంక ఆ అమ్మాయి గుండెగానం. ఆకాశం ఎర్రనవుతోంది.

సెల్వియా ముఖపద్మం క్షణకాలం పాటు వాడినట్లయిందిగాని మళ్లా వెంటనే వికసించింది. ఆ కొమ్మలు కొద్దిగా నెట్టి చూసేటప్పటికి, దూరాన సముద్రమగుపడింది. బాలభానుని కిరణపరాగంతో సముద్ర జలం బంగారువన్నె దాలుస్తోంది; తూర్పు దిక్కుగా పక్షులు ఎగురుతున్నాయి. చెట్టుకొమ్మమీదనున్న సెల్వియా, తను కూడా ఆ విధంగా ఎగరగలనని భావించింది. పడమటివైపుకి తల తిప్పగా చర్చి శిఖరాలూ, పల్లెలూ,

మిగతా ప్రపంచమూ కనిపించిం దామెకి.

పక్షుల పాటలు పెద్దవయాయి; సూర్యబింబం ధగధగ లాడింది దూరాన. సముద్రంలోని ఓడల తెర చాపలు కనిపించాయి. తెల్లటి నారాయణ పక్షొకటి, ఆకుపచ్చని కొమ్మలలో నుంచి, సముద్రంవైపుగా ఎగిరింది. హమయ్య! ఈ పక్షిని చూసేందుకూ, దానిరహస్యం తెలిసికొనేందుకూ కదా తను యింత ఎత్తు ఎక్కింది! నారాయణ పక్షులు ఎక్కడనుంచి వస్తున్నదీ, కళ్లు పెద్దవి చేసుకు చూసింది సెల్వియా. ఆ రెక్కల అందం, ఆ మెడపొగసు, ఆ చక్కని ముక్కూ — మాటలు చాలవు వర్ణించేందుకు! తనకి దగ్గిరలోనే, దేవదారు కొమ్మ మీద నిలబడి, తన నేస్తాన్ని లేపుతోంది నారాయణపక్షి, "నవనవోన్మేష శోభలతో నూతనోదయమయింది; నిద్ర మేలుకో, నేస్తమా" అంటోంది పక్షి.

మిగతా పిట్టల అరుపులు ఎక్కువయేటప్పటికి, నారాయణపక్షి అక్కడ్నుంచి వెళ్లిపోయింది; సెల్వియాకి అది ఎక్కడ వుంటుందో, దాని రహస్యం తెలిసిపోయింది. అంత ఎత్తునుంచి

## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..........................................................

అడ్రసు ..........................................................

..........................................................

..........................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004

కిందికిచూస్తే కళ్లు తిరుగుతాయని, కిందికి చూడకుండా, ఒక్కొక్క కొమ్మే దిగుతూ వచ్చింది. కాళ్లు రెండూ గీరుకుపోయి రక్తం కారుతోంది. అతి జాగర్తగా దిగింది సెల్వియా. నారాయణపక్షి ఎక్కడఉండేదీ తను చెప్పేటప్పటికీ, ఆ కొత్తతను ఎంత సంతోషిస్తాడో!

"సెల్వియా! సెల్వియా!!" అంటూ అమ్మమ్మ ఎంత అరిచినా సెల్వియా కనబడలేదు; పక్కమీద లేదు.

అతిథి నిద్రనుంచి లేచాడు. ఈ రోజైనా తనకి నారాయణపక్షి దర్శనం కాకపోతుందా అని అతని ఆశ! సెల్వియాకి ఆ పక్షి గురించి తెలిసినట్టుంది; ఆ అమ్మాయి పూనుకుంటే, యివ్వాళ తనకార్యం నెరవేరుతుంది - అనుకున్నాడతను. వొళ్లంతా గీసుకుపోయి, చినిగినబట్టలతో ప్రత్యక్షమయింది సెల్వియా వీధి గుమ్మంలో. అమ్మమ్మా, అతిథీ యిద్దరూ, ఎక్కడికెళ్లావని ఆ అమ్మాయిని ప్రశ్నించేందుకు, గుమ్మానికి అడ్డంగా నుంచున్నారు. ఫలానా హెమ్లాక్ చెట్టుమీద నారాయణపక్షి వుంటుందని చెప్పవలసిన సువర్ణఘడియ, సెల్వియాకి జీవితంలో ఆసన్నమయింది.

కాని, సెల్వియా మాట్లాడలేదు; అమ్మమ్మ తిట్టినా మాట్లాడలేదు; అతిథి ఎంతో జాలిగా ప్రేమగా అడిగినా మాట్లాడలేదు; అతని కళ్లలోకి చూసింది సెల్వియా. అతను పది డాలర్లుయిస్తానన్నాడు; ఆ పదిడాలర్లూ తమకెంతగానో పనికొస్తాయి. .... ఆ అతిథి, తమని ఎన్నోవిధాల ఆదుకోవచ్చు.

కాని, సెల్వియా తనకి తెలిసిన రహస్యం చెప్పదలచుకోలేదు. తను ఎందుకు చెప్పలేకపోతోందో ఆమెకి సరిగా అర్థం కావడం లేదు. నారాయణపక్షి ఎక్కడ ఉంటుందో చెబితే, ఈ మనిషి దాని ప్రాణాలు తీయకమానాడా? తనమూలంగా అంత చక్కటి పక్షి - నవనవోన్మేష శోభలతో నూతనోదయమయింది; నిద్ర మేలుకో, నేస్తమా - అనే పక్షి, వేటగానికి చిక్కడమా? అంతటి పాప కార్యం తను చెయ్యదు.

అతిథి వెళ్లిపోయాడు; తను మిగిలిపోయింది. ఆవుని తోలుకు యింటికి వస్తూండగా, అప్పుడప్పుడామెకి ఈల పాట వినిపించేది. ఏదో పోగొట్టుకున్నట్లు బాధగా ఉండేది: కాని తుపాకీ చప్పుడు ఎప్పుడు విన్నా, తనేమీ పోగొట్టుకోలేదనీ, పిట్టలే ఎంతో స్నేహపాత్ర మైనవనీ అనిపించేది. మనసు హరించిన ఆ అందగాని కంటె ఈ పక్షులు సన్నిహితమైనవా - ఏమో ఎవరు చెప్పగలరు? ధన ధాన్యాలు లేని ఏకాకిని కావచ్చునామె; కాని, ఆ హృదయం నిండా ప్రేమామృతధార.

—సారా ఆర్నె జ్యుయెట్

చందూర్ అనువాదాలు 1956

*Manufacturers of*

**Ephedrine Hydrochloride**

**Pseudo Ephedrine Hydrochloride**

**Drug Formulations**

1. ICMA Acharya P. C. Ray Award for the year 1986 for Development of Technology Indigenously.
2. Certificate of Merit by National Productivity Council in Recognition of Performance in Productivity.
3. D.S.I.R. National Award for R & D Efforts in Industry for the year 1990.

అనేక మంది పాఠకులు, 1991 ఏప్రిల్ సంచికగా వెలువడిన ఇంటర్నేషనల్ ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక కాపీ ఒకటి తమకి పంపమంటూ ఉత్తరాలు వ్రాశారు. కాపీలు లేవనీ, అందులోని ముఖ్యాంశాలు తిరిగీ పునర్ముద్రిస్తున్నామనీ చెప్పాము. ఆ ప్రకారమే చేస్తున్నాము. ఈ చిన్న పత్రిక పట్ల పాఠక మిత్రులకు గల ఆదరాభిమానాలకు మా మనఃపూర్వక కృతజ్ఞతాంజలి.

పదమూడేళ్ల తర్వాత ఇంటర్నేషనల్ ఫిలిమ్ ఫెస్టివల్ మద్రాసులో జనవరి పదోతేదీ నుంచి ఇరవైదాకా జరిగింది. అయితే, జర్నలిస్టులకి మాత్రం ఇండియన్ పెనోరమా చిత్రాలు మూడోతేదీ ఉదయంనుంచీ ప్రారంభమయాయి. ప్రతినిధులకీ, ప్రెస్‌కీ పదో తేదీన ప్రారంభోత్సవమయాక, రోజుకి అయిదేసి చిత్రాలు. 38 దేశాల నుంచి 108 వచ్చాయి; మనదేశంలోని 52. ఇవిగాక, తమిళ సినిమా వజ్రోత్సవ సందర్భమైన చిత్రాలు.

ఏ ఒక్కరూ అన్ని చిత్రాలూ చూడలేరు. అది అసాధ్యం - అసంభవం. అన్యదేశ చిత్రాలు 108 అయితే, సెంటినరీ హాలుకి కేటాయించినవి 45 మాత్రమే, దేవీలోను, కలైవానర్‌లోను మిగతావి చూపారు. పాత్రికేయులు, తాము చూడాలనుకున్నవి, తమ యక్రెడిటేషన్‌తో, ఎక్కడ ఏ చిత్రం ప్రదర్శింపబడుతున్నదో, అక్కడికి వెళ్లి చూడవచ్చు. ప్రదర్శన వివరాలు మీడియా సెంటర్‌లో యిచ్చేవారు. షార్ట్ ఫిలిమ్స్‌తో కలిపి, నేను అరవై డెబ్భయి చూసివుంటాను. వాటిలో కొన్ని చిత్రాలను, వీలైన చోట్ల బొమ్మలతో, పాఠకులకు పరిచయం చేస్తున్నాను.

—యన్నార్ చందూర్

# ప్రపంచ సినిమా

ప్రారంభ చిత్రం జెకొస్లొవాకియా

(Czecholovakia)

## చివరి సీతాకోకచిలుక

(The Last Butterfly)

1944 లో పారిస్ నగరం జర్మనుల వశమైవున్న రోజులలో ఆ మూకాభినయ కళాకారుడు అంటొనిని అరెస్టుచేస్తారు ; అతని ప్రియురాలిని కాల్చివేస్తారు. ఒక పోలీసాఫీసరు ఈ ప్రఖ్యాత కళాకారుని గుర్తించి, 'నీవు టెరిజన్‌లోని పిల్లలకొక ప్రదర్శన యివ్వు - ఈ బందిఖానా నుంచి నీకు విముక్తి కలిగిస్తాము' - అని బేరం పెడతాడు. అంటొని వొప్పుకుంటాడు. ఆ ఊళ్లో వుండే పిల్లలందరూ యూదులు..... "యూదుల పిల్లలని హిట్లర్ ఎంతో దయగా చూస్తున్నాడని, అంతర్జాతీయ రెడ్‌క్రాస్‌ని నమ్మించేందుకు ఈ ప్రదర్శన'' అని ఒక స్త్రీ, అంటొని చెవిలో వూదుతుంది. మూకాభినయ ప్రదర్శన జరుగుతుంది. కాని, అది పోలీసులు ఆశించినట్లుగా గాక, ప్రాచీన కావ్యంలోని ఒక అంశంతో, వ్యతిరేక భావం కలిగిస్తుంది. రెడ్‌క్రాస్ అసలు విషయం తెలుసుకొనేటప్పటికి అంటొని అక్కడ వుండడు.... 109 నిముషాలు. దర్శకులు : కారెల్ కాస్సినా.

✠ ✠ ✠

అల్జీరియా (Algeria)

ప్రజల ఆక్రందన

(The Cry of Men)

1957 నాటికి గ్రామీణ ప్రాంతమంతా ఆర్మీదవుతుంది - కాని, పట్నాలు పోలీసుల హస్తగతమై ఉంటాయి. ఈ పోలీసుల కెంతకీ టెర్రరిస్టులని ఎదుర్కోవడంతోనే సరిపోతుంది. పోలీసులతో ఆర్మీ కలహించదు గాని ఇద్దరూ కుమ్మక్కయి, ఒక ప్రజానాయకుని టెర్రరిస్టులు కాల్చగల అవకాశం కల్పిస్తారు. ఆ తర్వాత హంతకులు ముగ్గురినీ పోలీసులూ కాల్చేస్తారు. ఈ కుట్ర జనావళికైతే తెలియదుగాని, సైనికులూ పోలీసులూ కలిసివేసిన పథకం విఫలమై, ప్రజలు భారీఎత్తున తిరగబడతారు. విప్లవం మరింత గట్టిపడుతుంది.... 105 నిముషాలు. దర్శకులు : ఒకాబా టవిలూ.

✠ ✠ ✠

అర్జెంటినా (Argentina)

ముత్యాల పలువరస

(Eversmile New Jersey)

దంతవైద్యుడు పెర్గస్, సైడ్‌కారు గల తన మోటరు సైకిల్ మీద, ఎవ్వర్‌స్మయిల్ టూత్‌బ్రష్ ఎంత శ్రేష్ఠమైనదో పబ్లిసిటీ చేస్తూ పోతూండగా, సెలెస్టి అనే యువతి తటస్థపడు

తుంది. మొదట్లో ఆమె ఈ ఫెర్గస్ని సీరియస్గా తీసుకోదు. కాని, ఈ డెంటల్ సర్జన్ని ప్రతిచోట ఆ ఊళ్లో వాళ్లు ఎలా తప్పించుకు తిరిగేదీ చూస్తున్న కొద్దీ 'అయ్యో పాపం' అని పిస్తుందామెకు. ఒక్కో గ్రామంలో ఫెర్గస్ని తరిమి కొడతారు. దంతాలు పరిశుభ్రంగా లేకపోతే, శరీరారోగ్యం దెబ్బతింటుందని అందరికీ తెలుసు. అయితే, ఫెర్గస్ ఆ విషయం గుర్తుచేసి దంత పరీక్ష ఉచితంగా చేస్తాననడం తరువాయి, ప్రతి ఒక్కరూ పారిపోతారు. ఒకచోట పిప్పిపన్నుతీసి, ఆ మనిషిని బాధా విముక్తిని గావిస్తాడు: మరొకచోట డెంటల్ ఆపరేషన్ విజయవంతంగా చేస్తాడు - సెలెస్టి యితనికి సహాయంగా ఉంటుంది. 'నన్ను ఎందుకిలా వెంటాడుతావు - నాకు పెళ్లయింది' — అంటాడు ఫెరస్. సెలిస్టి వినదు. న్యూజెర్సీలోని ఎవ్వర్ స్మయిల్ టూత్ బ్రష్ల కంపెనీవారు, టూత్ బ్రష్ల ఉత్పత్తి మానేసి, మరొక సరుకు చేబట్టడంతో, ఈ డెంటల్ సర్జన్ ఉద్యోగం ఊడిపోయి, సెలిస్టితో ఆమెకి రాంచ్కి (వ్యవసాయ క్షేత్రం) వెళ్లవలసి వస్తుంది. నవ్వులు వెదజల్లే చిత్రం.... 94 ని॥.... దర్శకులు: కార్లో సొరిన్.

✠ ✠ ✠

అమెరికా
(America)

## కారు డ్రయివరు
(Driving Miss Daisy)

ఒకప్పుడు టీచరుగా పని చేసిన డైజీ, మధ్య వయసు వచ్చిన కొడుకు పట్నం నడిబొడ్డున వుండగా, తను మాత్రం ఊరుకి దూరంగా విశాలమైన యిల్లూ తోటతో తన ప్రత్యేకత కాపాడుకుంటూ ఒంటరిగా ఉంటుంది 'డెబ్భయ్యయిదేళ్లు వచ్చాయి - నీవు డ్రయివ్ చేయవద్దు' అని కొడుకు బతిమాలి, కాల్బర్న్ని (నీగ్రో) డ్రయివరుగా నియమిస్తాడు. ఈమె జ్యూ (యూదు). పెద్దవయసు, ఒంటరితనం తన మాటకు ఎదురు చెప్పడమనేది లేని విధంగా గడిపిన జీవితం! కాల్బర్న్ని చీటికీమాటికీ చివాట్లు పెడుతూ తను యజమాని, అతను సేవకుడు అనేది అనుక్షణం గుర్తు చేస్తూ వుంటుంది. అయితే, లోతైన మనసు గల కాల్బర్న్ ఆమె అధికార దర్పాన్ని ఆగ్రహావేశాన్ని చిరునవ్వుతో స్వీకరిస్తూ శబ్దాతీతమగు మానవతా బంధానికి కట్టుబడి నడుచుకుంటాడు. చివరికామె వృద్ధులవసతి గృహంలో చేరినప్పుడు, ప్రతివారం వచ్చి అభిమానంతో పలకరించే మనిషి యితనొక్కడే అవుతాడు .... 99 ని॥.... దర్శకులు: బ్రూస్ బెరస్ఫోర్డ్.



ఫెస్టివల్ డైరక్టర్ దీపక్ సాంధూ, కేంద్ర సమాచార కార్య దర్శి మహేష్‌ప్రసాద్, మరొక ఉన్నతోద్యోగి - మీడియా సెంటర్లో

## ఏకాంత వాసం
(Lonely in America)

అమెరికా ఒక భూతల స్వర్గ మని ఇండియా నుంచి వస్తాడు అరుణ్. ఎక్కడికక్కడ ఎదురు దెబ్బలు. మేన మామని నమ్ముకు వచ్చాడు. అయితే, ఆ మేనమామ యితనిని తన బిజినెస్‌లో యిరికిద్దామనుకుంటాడు. ప్రారంభం లో మెత్తబడి, ఆ పైన తనకి తానుగా నిలబడే ప్రయత్నం చేస్తాడు అరుణ్. ఇతనికి కావల్సినది కంప్యూటర్ జాబ్ - ఒక అమెరికన్ ఫ్రెండ్ యపార్ట్‌మెంటు లో చేరి, మేనమామ పట్టు వొదిలించుకు, న్యూయార్క్ వీధులలోని ఒంటరితనం స్వానుభవంలో తెలుసుకు 'అమ్మాయి ప్రేమ పొందేందుకు అర శతం పద్ధతులు' ఈవినింగ్ క్లాసుల్లో జాయినై, రెండు సంస్కృతుల వైరుధ్యంలో వుక్కిరిబిక్కిరవుతూ, మళ్లీ స్వజనం వద్దకు వచ్చి, 'పెళ్లిళ్లు పెద్దలు కుదర్చడం వల్ల ఎన్నో ప్రమాదాలు వున్నాయి' అని ఫిలాసఫీ పలుకుతూ, చివరిదాకా మనని నవ్విస్తాడు అరుణ్

94 ని॥.... దర్శకులు: బారీ అలెగ్జాండర్ బ్రౌన్.

## వేయి సవరలు
(Thousand Pieces of Gold)

శాన్ ఫ్రాన్సిస్కోలోని బార్బరీ తీరంలో ఒక తార్పుడుగాని చేతుల్లో పడ్డ లాలూ, తనని ప్రేమించిన జిమ్ ద్వారా విముక్తి పొందగలనను కుంటుంది. జిమ్ ఆ మొత్తం చెల్లించేం దుకు సిద్ధపడతాడు. అయితే, ఈ విష

వలయపు యజమాని అంతకి పూర్వమే ఈమెని ఛార్లీకి జూదంలో ఓడిపోతాడు. ఛార్లి, లాలూ ప్రేమ పక్షుల్లా బతకడం చూసిన జిమ్‌కి, తను వచింపబడ్డాననే భావం కలుగుతుంది. లాలూకి ఈ శారీరక లాలసకంటె తన యిల్లూ పిల్లలూ ముఖ్యమనిపిస్తుంది.... 105 ని॥.... దర్శకత్వం : నాన్ కెల్లీ.... పైన చెప్పిన మూడేగాక మరో తొమ్మిది : మొసలికళ్లు; పలాయనుడు; జులై నాలుగు ; స్వర్గసీమ చూడండి ; తప్పులు - దోషాలు ; వాద్య విశేషం ; హామ్లెట్ ; గులాబీల యుద్ధం ; హెన్రీ- జాన్ అమెరికా నుంచి వచ్చాయి ఫెస్టివల్‌కి. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికావి మొత్తం పన్నెండు.

✠ ✠ ✠

## ఆస్ట్రేలియా
## (Australia)

### నాన్న
### (Father)

హొటల్ బిజినెస్‌లో తమ కుటుంబానికి కావల్సినంత సంపాదించి, ఆ హొటల్ నిర్వహణ ఒక్కగానొక్క కూతురికి అల్లుడికీ వొప్పజెప్పి, యిద్దరు మనవరాళ్లతో చీకూచింతా లేని జీవితం గడుపుతున్న ముల్లర్ నెత్తిపై పిడుగుపడుతుంది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో తన తలిదండ్రులనీ కుటుంబంలోని యావన్మందినీ యూదులనే సాకుతో తుదముట్టించిన జర్మన్ ఆఫీసరు ఇతనేనని కొన్ని ఆధారాలతో 'ఇయా' అనే మధ్య వయస్కురాలు కేసు పెడుతుంది. ఒక టెలివిజన్ రిపోర్టర్ యింటర్వ్యూ చేయడానికి రాగా, తనకిదేమీ తెలియదనీ, నిర్దోషిననీ అంటాడు. కేసు నమోదు అవుతుంది. పోలీసులు పూర్వాపరాలు విచారిస్తారు. కోర్టులో అయితే కేసు కొట్టేస్తారుగాని కూతురికి మాత్రం తన తండ్రి నిజంగా నిర్దోషా? - అనేది, తెగని సమస్యగా మిగిలిపోతుంది.... 100 ని॥.... దర్శకులు : జాన్ పవర్.

✠ ✠ ✠

### బంగారు సవరం
### (The Golden Braid)

ప్రాచీన వస్తువులంటే మక్కువగల వాచ్ రిపేరర్ బెర్నార్డ్, 18వ శతాబ్దపు కప్ బోర్డ్ ఒకటి కొంటాడు. ఆ కప్ బోర్డ్‌కున్న ఒకానొక రహస్యపు సొరుగులో బంగారు వన్నె జుట్టుతో సవరం కనిపిస్తుంది. పురాతనమైన వంటే చెవి కోసుకొనే బెర్నార్డ్, ఆ బంగారు సవరాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటూ, దాని వెనకనేదో మహాకావ్యం ఉండాలని, కమ్మటి కలలోను తేలుతూ వుంటాడు. ఒక రోజున ఆ సవరం మాయమవడంతో యితని ప్రపంచం నిలువునా కుంగిపోతుంది. అయితే, ఇతనిని మనసారా ప్రేమించిన తెరిసా ఈ అయోమయం నుంచి బెర్నార్డ్‌ని లేవనెత్తి ఒక దరికి చేరుస్తుంది.... 90 ని॥.... దర్శకులు : పాల్ కాక్స్ .... ఆస్ట్రేలియా నుంచి ఈ రెండేగాక అవా, మరకతపురి, తనఖా, పిడుగు



సమాచార శాఖలోని ఉన్నతోద్యోగులతో (ఆ నాటి) కేంద్ర మంత్రి సుబోధ్ కాంత్ సాహె - మీడియా సెంటర్లో

పాటు - అని మరొక నాలుగు చిత్రాలు వచ్చాయి.

(Austria)

బలిదానం

[Idomeneo]

ట్రోజన్ యుద్ధం ముగిశాక, క్రీటు ద్వీపం రాజు, తమ దేశానికి తిరిగి వస్తుండగా సాగర మధ్యాన పెద్ద తుపానులో యిరుక్కుంటుంది వారి నౌక. సాగర జలాలకు అధిపతి అయిన వరుణదేవుని 'నన్ను సురక్షితంగా ఇల్లు చేర్చు - భూమ్మీద పాదం మోపగానే కనపడ్డ మొదటి నరుని నీకు బలి యిస్తాను' - అని వేడుకుంటాడు. తండ్రి యింకా రాలేదామా అని ఆదుర్దాగా ఎదురు చూస్తున్న కొడుకే, ఆరాజుకి కనిపించిన మొదటి నరుడవుతాడు - రుక్మాంగద, ధర్మాంగదుల కథలా.... 95 ని॥ .... దర్శకులు : మైఖేల్ క్రెథాల్.

బంగ్లాదేశ్

(Bangla Desh)

విషవృక్షం

(The Poison Tree)

సూర్యముఖి, నాగేంద్రనాథ్ సంపన్న కుటుంబంలోని అన్యోన్య దంపతులు - ఒక్కటే కొరత, సూర్యముఖికి సంతానం కలగలేదు.... నాగేంద్రనాథ్ తన ఎస్టేటు పర్యవేక్షణకు వెళ్ళినప్పుడు నిరాశ్రయురాలైన కుందనందిని తటస్థపడుతుంది. ఆమెని తమ భవంతికి తీసుకొస్తాడు - సూర్యముఖి ఆమెని అభిమానంతో ఆదరించ



# బాపూజీ చూసిన రేపటి ప్రపంచం



" రేపటి ప్రపంచం అహింసపై ఆధారపడి ఉండాలి. ఆధారపడి ఉంటుంది అది ప్రాథమిక సూత్రం దాని వలన అన్ని రకాల శ్రేయస్సులు లభిస్తాయి

వ్యక్తులూ, సమూహాలు, దేశాలు అహింసా మార్గాన్ని అవలంబించాలి అదే ప్రేమమయ మార్గం

అప్పుడు భావి ప్రపంచంలో పేదరికం ఉండదని, యుద్ధాలుండవని, విప్లవాలూ రక్తపాతాలూ ఉండవని నా విశ్వాసం "

## శాంతియుతమైన మార్పుతో అభివృద్ధి

?

"Rama and Krishna are two different incarnations of Lord Vishnu. Of these incarnations, some put the number at ten while others place it at twentyone. Whatever it be" at different times God has assumed different forms to set things right and keep the world going smoothly," said Raghu.

"It could be twentyone or ten or just three, or even merely one - *YEKO NARAYANA*. What is it you want to know?" questioned Raghu's Father.

"Bhagavata is the story of Krishna - with his pranks, miracles, superhuman deeds, blissful romances, elopement with a princess, marrying eight and maintaining a lot, valour, diplomacy, tact, enunciating the core of philosophy - what a colourful life! In comparision, Rama appears so simple, straightforward, honest, with a rare gift of dissecting good from evil, truth from falsehood, right from wrong etc.."

Raghu's Father cut him short and said. 'Two different manifestations of the same Supreme. Bhagavata, my boy, is a Purana. Puranas are intended to teach people the way to attain *Moksha* - the final phase of human existence. Bharata and Ramayana are Itihasas - they show the Righteous path of Living. If you know the basic difference between the two, you will not get confused with our mythological lore.'

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*

డమే గాకుండా, 'కుందని పెళ్లిచేసుకు వంశం నిలపకూడదా ?' అని భర్తకు సూచిస్తుంది. కాని, నాగేంద్రనాథ్ సుతరామూ యిష్టపడడు. 'పిల్లలు లేనంత మాత్రాన మన దాంపత్యాను రాగానికి వచ్చిన యిబ్బందేమిటి ?' అని అడుగుతాడు. తననొక మనిషిగా చేసి నిలబెట్టిన నాగేంద్రనాథ్ మీద కుందనందినికి విపరీతమైన ఆరాధన. అయితే, అది దాటకూడని లక్ష్మణ రేఖ - తనలో తానే కుమిలిపోతుంది. తను తప్పుకుంటే తన భర్త, కుంద దగ్గిరవుతారేమోనని ఎవరికీ చెప్ప కుండా అమాంత్రం యింట్లోనుంచి మాయమవుతుంది సూర్యముఖి. ఈ ఎడబాటు నాగేంద్రనాథ్‌ని కుంగ దీస్తుంది; కుందని మరింత ఖిన్ను రాలు గావిస్తుంది. సూర్యముఖి వంశో ద్ధారకుని ప్రసాదించడమూ, దిక్కూ మొక్కూలేని కుందనందిని ఆత్మా ర్పణాతో కథాంతమవుతుంది. బంకిమ్ చంద్రభటర్జీ నవలలోని రసాత్మక విలువలు మనసున హత్తుకుంటాయి .....124 ని॥ దర్శకులు ఖాషి నజ్రుర్ ఇస్లామ్.

✠ ✠ ✠

## బ్రిటన్
## [United Kingdom]
## ప్రతి ఒక్కరూ నెగ్గడం
## [Everybody wins]

ఒక పెద్ద మనిషిని హత్య చేశాడనే నేరం మీద ఒక అమాయక బాలునికి శిక్ష పడుతుంది. ఊళ్లో అందరికీ తెలుసు ఆ అమాయకుడు అంత ఘాతుకం చేయలేడని! అసలు హంతకుడెవరో తాను కనిపెడతానని, న్యాయరక్షణ నెపంతో రంగంలోకి ప్రవేశిస్తుంది ఏంజిలా. ఆమె జరిపే పరి శోధనలు చివరికొక దగుల్బాజీని కాపాడే తెరగా పరిణమిస్తాయి. ఏంజిలా నేర్పుగా జారుకుంటుంది.... 97 ని॥.... దర్శకులు: కారెల్ లీస్జ్.... ఆటేన్ రాణి; 1871: మూకగర్జన; హాలీ సాలీని కలుసు కున్నప్పుడు - అని మరొక నాలుగు పిక్చర్లు వచ్చాయి యుకె నుంచి.

## బల్గేరియా
## (Bulgaria)
## ఒకే ఒక్క సాక్షి
## [The Only Witness]

క్రిస్టి సగటు మనిషి – మంచి చెడలు తెలిసిన మనిషి – పదిమందికి దేనివల్ల మంచో, దేనివల్ల చెడ్డో సుస్ప ష్టంగా మనోగతాన గ్రహించగల మనిషి. పరితాపం, ప్రమోదం ఈ రెండూ హృద్వీణపై పలికే రాగాలు, తన తరంవారు గమ్యంగా పెట్టుకున్న లక్ష్యాను, పాటించిన విలువలను ఈ తరం ఎందుకు నేలరాస్తుంది? చుట్టూ కనిపిస్తున్న పతనానికి కారణం సామా జిక పరిస్థితులా, ఆనాటి కానాడు కుంచించుకు పోతున్న బుద్ధులా? తన తరం ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పలేదనీ కాలగతితో తలవంచుకు వెళ్లిపోవడమే తమ కర్తవ్యమనీ




తండ్రి అంత గొప్పవాడినవాలని తనయుడను కోవటం సహజం, ఉపాధ్యాయ వృత్తిలో వున్న తండ్రిని ఊళ్ళోవాళ్ళు మెచ్చుకొనే సరికి ఆ బాలునిలో కలిగిన ఆనందమే ఫ్రెంచి చిత్రం 'మై ఫాదర్స్ గ్లోరీ' (My Father's Glory). దర్శకులు : వైవిస్ రాబర్ట్ (Yves Robert)

అంటాడు క్రిస్టీ.... 61 ని॥.... దర్శకులు : మైఖేల్ పాండురోస్కి.

✠ ✠ ✠

కెనడా
(Canada)
కాగితం పెళ్లి
(A Paper Wedding)

'నీ వీసాకి టైమయిపోయింది - ఇంకా యిక్కడ ఎందుకున్నావ్ ?' అని నిలదీస్తాడు ఇమ్మిగ్రేషన్ ఇనస్పెక్టర్, - కాందిశీకుడైన పాబ్లోని. కెనడానుంచి తరిమి వేయబడకుండా వుండాలంటే, కెనడియన్ యువతిని కెనడియన్ పౌరసత్వం తీసుకోవచ్చు. కాందిశీకుణ్ణి పెళ్లిచేసుకోనేందుకు ఎవరు ముందుకొస్తారు ? కష్టాలలో వున్నవారిని ఆదుకోవడమే వృత్తిధర్మంగా భావించే లాయర్ యానీ ఉపాయం చెబుతుంది. 'మా చెల్లెలు క్లెయిర్‌ని వొప్పించి నీకు పేపరు పెళ్లి చేయిస్తాను - కేవలం పేపరు పెళ్లి – ఈ గండం నుంచి బయట పడేందుకు' - అంటుంది. బతుకు జీవుడా - అని ఊపిరి పీల్చుకుంటాడు పాబ్లో. క్లెయిర్‌ని పెళ్లిచేసుకుందామనుకున్న వరునికి ఈ ఏర్పాటు రుచించకపోయినా, ప్రముఖ లాయరైన వొదినగారి మాట కాదనలేక పోతాడు. క్లెయిర్‌కి, పాబ్లోకి పేపరు పెళ్లి జరుగు

తుంది. ఇందులో ఏదో మెతక వుందని నిరూపించేందుకు, ఇమ్మిగ్రెషన్ ఇన స్పెక్టరు వీరిని వెంటాడుతాడు. అతనిని నమ్మించేందుకు, వీరు ఒక హూటల్ రూమ్‌లో మకాం చెయ్యవలసి రావడం తో పేపరు పెళ్లి నిజంపెళ్లి అవుతుంది ....90 ని॥.... దర్శకత్వం : మైఖేల్ బ్రౌల్ట్.... కెనడానుంచి వచ్చిన మరొక చిత్రం పేరు : మంచు తుపాను.

❀ ❀ ❀

## ఛిలీ
## (Chile)
## అద్దంలో చంద్రబింబం
## (The Moon in the Mirror)

పట్టెమంచం మీద విశ్రాంతి తీసుకుంటూ, గదిలో అమర్చిన అద్దాల ద్వారా యింట్లో జరుగుతున్న సమస్తం, తను హాయిగా పడుకొని తెలుసుకొనే ఆర్నాల్డో, ఒకప్పటి నావికుడు. నౌకాయానమూ, నౌకా చరిత్ర,కా ప్టెన్‌లూ, యడ్మిరల్సూ - యివి మాత్రమే మాట్లాడే ఆ తండ్రికి, కొడుకు గొర్డొ అంటే ఎంతో అభిమానం. అభిమానమే కాదు, తన గుప్పెట్లోనుంచి జారిపోతాడేమోనను భయం కూడా. పొరుగునున్న లుక్రిటెషియా, వయసులో కొడుకు కంటె కొంచెం పెద్దది, ఈ గొర్డొని వేజిక్కించుకోవాలని చూస్తోంది. కబుర్లు, కౌగలింతలు, ఆకలి చూపులు - యివన్నీ ఆర్నాల్డొకి అద్దాల ద్వారా తెలుస్తూనే వున్నాయి. తన మాట కెదురాడని గొర్డొని, నేర్పుగా నక్క జిత్తులతో తన దారికి తెచ్చుకుంటాడు ఆర్నాల్డొ.... 75 ని॥.... దర్శకత్వం : సిల్వియా కయోజ్జి.

❀ ❀ ❀

## చైనా
## (China)
## జొ - డౌ
## (Jo Dou)

రంగుల వర్తకం చేస్తున్న పెత్తండ్రి వద్ద పని నేర్చుకుంటూవుంటాడు జిన్ షాన్. ఒక రోజున ఆ పెద్దాయన అందమైన పిల్లని (జొ - డౌ) పట్టుకొస్తాడు ఇంటికి. ఈ వయసులో యిలాటి దుర్బుద్ధేమిటి ? - అనుకుంటాడు జిన్‌షాన్. కాని, పైకి అంటే చీరేస్తాడు - ఇంట్లోనుంచి పొమ్మంటాడు.... ఆ పిల్ల వంపుసొంపులు దొంగచాటుగా చూసి తృప్తిపడె జిన్ షాన్, యాక్సిడెంటై పెత్తండ్రి మంచం పట్టాక ధైర్యం తెచ్చుకుంటాడు. ఆ వుంపుడుగత్తె, వయో సామీప్యత, దైహిక లాలస కారణంగా జిన్‌షాన్‌కి చేరువవుతుంది.... 94 ని॥.... దర్శకులు : జాంగ్ ఇ-మౌ.

❀ ❀ ❀

## కొలంబియా
## (Colombia)
## భవిష్యత్ శూన్యం
## (No Future)

ఉద్యోగాలు దొరకవు ; చదువు కొనే అవకాశాలు తక్కువ, ఎటు చూసినా అవినీతి, అన్యాయమూ, లంచ గొండితనము. యువతకు ఆశయం



తన కడుపు పండని కారణంగా, కుటుంబ గౌరవం కాపాడే వంశోద్ధారకుని కోసం, మరొక స్త్రీని తన భర్తకు జత పరుస్తుంది యాన్ – దక్షిణ కొరియా చిత్రం 'సర్రొగేట్ వుమన్'లో (Surrogate Woman). ఇమ్ క్వాన్ - టెక్(Im Kwon-Taek)

లేదు, లక్ష్యం లేదు తాము గుర్తింపు పొందేందుకు టెర్రరిజమ్ ఒక్కటే తరుణోపాయం. ఆత్మగౌరవం తాకట్టు పెట్టి, సిగ్గు పడాల్సిన పనులు చేయాలి. దొంగతనం, దౌర్జన్యం ఘనకార్యాలుగా తమని తాము మభ్య పెట్టుకోవాలి. ఈ శతాబ్ది ఎనభైలలో మెడిలిన్ నగర వీధులలోని యువత పరిస్థితి యింతే! వారికి భవిష్యత్ లేకపోవడానికి ఎవరు బాధ్యులు? .... 92 ని॥ .... దర్శకత్వం : విక్టర్ గవిరియా.

✠ ✠ ✠

జెకొస్లొవాకియా
(Czechoslovakia)
కొమ్మమీద హాయిగా
(Sitting Pretty on a Branch)

1944 నాటి లక్షలాది నిర్వాసులలో పిపి అనే యాక్టరూ, ప్రెంగెల్ అనే సోల్జరూ తిండిలేక అల్లాడుతూండగా, రహస్య బంగారం వారి కంటబడుతుంది. ఒక జ్యూకి చెందిన రొట్టెల షాపులో ఎస్తర్‌బొమ్మ చూస్తారు; ఎస్తర్ని పోలిన అమ్మాయి పీరి దగ్గర పని చేయడానికి వస్తుంది. యుద్ధకాలంలో అనేక మందివల్ల అత్యాచారానికి

గురైన ఈ ఎస్తర్, తండ్రి ఎవరో తెలియని ఆడపిల్లని హస్పిటల్‌లో ప్రసవించి, మరణిస్తుంది. దొరికిన సొమ్ము ప్రభుత్వానికి స్వాధీనం చేయని నేరానికిగాను పిపి, ప్రెంగెల్ యిద్దరూ అరెస్టవుతారు. విడుదలయాక, ఎస్తర్ తమ జీవితాలలోకి తెచ్చిన వసంత సమీరానికి కృతజ్ఞతా చిహ్నంగా, ఆ అనాథ శిశువుని తమ దత్తపుత్రిక చేసుకుంటారు.... 113 ని॥.... దర్శకత్వం : జురాజ్ జకు బిస్కో.... ప్రారంభ చిత్రమూ, యిదీగాక, జెకొస్లొవాకియా నుంచి వచ్చిన మరొక చిత్రం పేరు : అంత్యక్రియలు.

## డెన్మార్క్
## (Denmark)
## ఎమ్మా నీడ
## (Emma's Shadow)

ఎమ్మా తల్లి సోషల్ వర్కర్; తండ్రి బిజినెస్ మాన్. ఒకరికి సమాజోద్ధరణ, మరొకరికి ధనసంపాదనా ముఖ్యమవడంతో ఈ చిన్నపిల్లకు వాత్సల్యానురాగం కరువుతుంది. ఒక నాడు అమ్మా నానా కిడ్నాప్ చేయబడ్డ లింట్‌బర్గ్ కుమారుని గురించి మాట్లాడుకోవడం విని, తను కూడా కిడ్నాప్ అవడం ద్వారా తలిదండ్రుల ప్రేమ పొందగలననుకుంటుంది - ఒక స్లమ్ చేరుకుంటుంది. డ్రయినేజ్ వర్కర్ మాల్తె, ఈ పిల్లకు ఆశ్రయమిచ్చి, ఆకలితో అలమటిస్తున్న పసిదానికి తిండి పెడతాడు. రెండు రోజులు గడిచాక, ఎమ్మా తలిదండ్రుల స్వాధీనమవుతుంది. కాని, ఆ బాలిక తన చీకటి గుండెలో దీపం వెలిగించిన మాల్తెని మాత్రం మర్చిపోదు; అతనిని చూడటానికి వస్తూవుంటుంది; ఆ స్నేహానుభూతి ఆమెకు ధీరత్వ లక్షణమిస్తుంది .... 93 ని॥.... దర్శకులు : క్రాగ్ జాకబ్సెన్.

## ఫ్రాన్స్
## (France)
## క్షురకాంత భర్త
## (The Hairdresser's Husband)

బార్బరునివారు హెయిర్ డ్రెస్సర్ అంటారు. పురుషులకి హెయిర్ డ్రెస్సింగ్ (క్రాపు) చేసేవారు సాధారణంగా స్త్రీలే అయివుంటారక్కడ. వారు పురుషులకి మాత్రమే అని కేటాయింపుగా ఉంటారు. తన పన్నెండో ఏట క్రాప్ చేయించుకోవడానికి ఆంటోని వెళ్లినప్పుడు, ఆ హెయిర్ డ్రెస్సర్ క్రాప్ చేస్తుండగా అతని దృష్టి ఎంతకీ ఆమె వక్షోజాల మీదనే ఉంటుంది. ఆ బాలుని మదిలోని అస్పష్టభావాలు అంబర చుంబితాలు కాగా, తను ఎప్పటికైనా హెయిర్ డ్రెస్సర్నే పెళ్లిచేసుకోవాలనుకొంటాడు. చిన్నినాటి హెయిర్ డ్రెస్సర్, అనుమానాస్పద పరిస్థితులలో చనిపోతుంది, కాని, హెయిర్ డ్రెస్సర్ని పెళ్లాడాలనే అతని నిర్ణయం మాత్రం మారదు. అంత చేరువగా నిలబడి, పరిమళం వెదజల్లుతూ, స్పర్శానుభూతిని యిస్తూ, మాసిన



ఢిల్లీనుంచి వచ్చిన ఇన్‌ఫర్మేషన్ ఆఫీసరు చతుర్వేది, 'సంధ్యారాగం' దర్శకులు బాలూ మహేంద్ర- మీడియా సెంటర్లో

తలకు కత్తెర ద్వారా కొత్తరూపమిచ్చి చిరునవ్వుతో సాగనంపే క్షురకాంత కంటె అందమైన వారెవరున్నారీ లోకంలో ? – అనిపిస్తుందతనికి. ముప్ఫయ్యయిదేళ్లు వచ్చినా ఆ అభిప్రాయం మారదు. తన స్వప్నాలకు సమాధానమా అన్నట్లు, హెయిర్ డ్రెస్సర్ మాథిల్డా తటస్థపడుతుంది. 'నన్ను పెళ్లి చేసుకుంటావా ?' అని ఈ పెద్ద మనిషి అడిగేసరికి, ఆమె మొదట్లో కొంచెం తెల్లబోయి, ఆ తర్వాత తేరుకొని, సరే అని వొప్పుకుంటుంది. ప్రణయ సామ్రాజ్యంలో వోలలాడుతారు ఇద్దరూ. అతని కల నిజమయింది. కాని, ఆమె ఈ కల కరిగిపోకుండా, ఈ ప్రేమామృతధార యింకిపోకుండా, తన చెలికాని వలపు వన్నె తగక పూర్వమే, ఆ స్వప్నంలో కలిసిపోయేందుకు, నదిలోకి దూకి ఆత్మహత్య గావించుకుంటుంది....90 ని॥.... దర్శకులు : ప్రెటిస్ లికొంటి.

మా నాన్న గొప్పతనం
(My Father's Glory)

పదేళ్ల మార్సెలూ, అతని తమ్ముడూ, తల్లిదండ్రులు, అత్తమామలతో సెలవలకని, పర్వత ప్రాంతాను నున్న ఒక గ్రామానికి వెళ్లారు. తండ్రి ఒక స్కూలు టీచరు. గడిచిన శతాబ్ది చివరి దశకంలో జరిగిన కథ యిది. అప్పటికింకా ఎలక్ట్రిక్ దీపాలు, ట్రామ్‌బళ్లూ, తారురోడ్లూలేవు. తండ్రి,

మామయ్య వేట కెళ్తుంటారు - మార్సెల్‌కి ఒక గ్రామీణ బాలునితో జోస్తి కుదురుతుంది; ప్రకృతిని ఎలా మచ్చిక చేసుకు బతకాలో ఆ బాలుడు నేర్పుతాడు. అరుదుగా కనిపించే ఒక పక్షిని తన తండ్రి కొట్టి, దానిని సూఊరు మార్కెట్‌లో అమ్మడంతో, య్కలు టీచరు ఘనత. గౌరవం ఆ నుమడిస్తాయి. తండ్రి అంత గుర్తింపు పొందినందుకు తనయుడైన మార్సెల్‌కి గర్వంగా ఉంటుంది.... 105 ని॥.... దర్శకులు; వైవెస్ రాబర్ట్.... ఈ రెండుగాక ఫ్రాన్సు నుంచి వచ్చిన మిగతావి : గుండె గుబ గబ ; సిరానో ; అట్లాంటె ; నికిటా ; బ్లాంచి.... మొత్తం ఏడు చిత్రాలు.

✠ ✠ ✠

## జర్మనీ (Germany)

## శశిరంలో క్షీరం

## (Autumn Milk)

బవేరియన్ వ్యవసాయ దారుని కుమార్తె యానాకి, నాజీ జర్మనీలోని గొడవలు, యింటెడు బంధువులూ విసుగూ విరామం లేకుండా మాట్లాడే రాజకీయాలు చిరాకు పుట్టిస్తాయి. పొరుగునున్న అల్బర్ట్‌ని ప్రేమిస్తుంది – యిద్దరూ పెళ్లి చేసుకుంటారు. అయితే, నిర్బంధ సైనిక విధాన కారణంగా, అల్బర్ట్ ఆర్మీలు చేరవలసి వస్తుంది. అప్పటికి యానా గర్భవతి. అత్తగారి రుసరుసలు లక్ష్యపెట్టకుండా, అల్బర్ట్ వ్యవసాయ భూమిని కాపాడి, పంటపండించి, చుట్టుపట్టనున్న రైతులని ఆశ్చర్య పరుస్తుంది. కాగా, వెనకటి నాజుకుపోయి, రైతు వనితకుండే కరుకుతనం ఆమె స్వభావంలో చోటు చేసుకుంటుంది.... ని॥ 111 .... దర్శకత్వం: జోసఫ్ విర్స్‌మేలర్, జర్మనీ నుంచి వచ్చిన మరొక చిత్రం : డాక్టర్ యమ్.

✠ ✠ ✠

## గ్రీక్సు

## (Greece)

## ఎక్సీనీయా

## (Xenia)

అతను ఫ్రాన్సు నుంచి వచ్చిన యాక్టర్ ; ఆమె గ్రీకు యువతి ; ఇరువురూ ఎటువంటి పట్టింపులూ లేని స్వేచ్ఛాజీవులు. మాత్యు, ఎక్సినియాని కలుసుకొనే నాటికే ఆమె గర్భవతి. ఆ గర్భస్థ శిశువుని 'యాండలూసియా, లో ప్రసవించాలని ఆమె సంకల్పం. ఇరువురూ తమ కారులో యడ్వెంచర్లు చేసుకుంటూ, బ్రతుకొక విహార యాత్రలా ప్రయాణం చేస్తారు. 'యాండలూసియా' హస్పిటల్‌లో జాయినైన ఎక్సినియా ప్రసవానంతరం మరణిస్తుంది. ఆ పసి గుడ్డుకి తను తండ్రికాదని తెలిసినప్పటికీ, తనే తండ్రినంటాడు మాత్యు ఎక్సినియా పట ఏర్పడ్డ మమతాబంధం తెంచుకోలేక ! .... 90 ని॥.... దర్శకులు : ప్రొటిస్ వివాంకొ.... గ్రీసు నుంచి వచ్చిన మరొక చిత్రం : ఓల్గా రాబర్డ్స్

✠ ✠ ✠



పతితగా జీవిస్తున్న లాలూని, జిమ్ కాపాడినా, ఆ పైన జూదంలో ఛార్లీ వశం కాగా, ఆమె ఛార్లీతో వుండి పోవడమా, తన వాళ్లందరూ వున్న శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్లిపోవడమా అనే సందిగ్ధం లో పడుతుంది - అమెరికన్ చిత్రం 'వెయ్యి బంగారు కాసులు'లో (Thousand Pieces of Gold) ....దర్శకులు : నాన్సీ కెల్లీ (Nancy Kelly

## హంగేరి
## (Hungary)
### జీసస్ జాతకం
### (Jesus Christ's Horoscope)

చరిత్ర క్రూరాతిక్రూరంగా పరుగులు పెడుతోంది. అసలు ఈ భూమి పుట్టుక ఎక్కడ? విశ్వాంతరాళం నుంచి విసిరివేయబడ్డ ఈ శకలానికి చిల్లు పడితే నరజాతి ఉంటుందా? వాతావరణ విజ్ఞానం ఈక్షణాన నిజమనుకున్న దానిని మరుక్షణాన వమ్ము చేస్తోంది. దేనిని నమ్మడం, నమ్మకోవడం? జీసస్ అనే వ్యక్తి ఒకప్పుడు వాస్తవంగా ఉన్నాడా? - అని ప్రశ్నించే తరమిది. ఏ విలువలూ ఏ నమ్మకాలూ లేనప్పుడు తన ఉనికి మాత్రం నిజమా? తను నిజమా? అంతా ప్రశ్నార్థకం.... 95 ని॥.... దర్శకులు : మిక్లాస్ జానక్సో.

## ఇండొనిషియా
## (Indonesia)

## (The Bintaro Tragedy)

తన అయిదుగురు మనుమల్ని పెట్టుకు, కాయకష్టంతో పట్నంలో

బతుకుతున్న ఆ పెద్దావిడమైనాకు ఒక్కటే ఆశ. తగు డబ్బు కూడబెట్టి తమ పల్లెటూరు వెళ్లిపోతే జీవితం సుఖవంతంగా ఉంటుందని! తొమ్మిదేళ్ల పెద్ద మనుమడు పేపర్లు అమ్మి కావల్సిన మొత్తం వెనకేస్తాడు. మనుమలతో రైలుస్టేషను కొచ్చిన మైనా, తన స్వప్నం ఫలించినందుకు సంతోషపడుతూ రైలు ఎక్కుతుంది. అయితే, స్టేషన్‌దాటి వెళ్లిన ఆ ట్రయిన్‌ని, ఎదురొస్తున్న మరొక ట్రయిన్ ఢీకొనడంతో సమస్తం ఛిన్నాభిన్నమవుతుంది.... 115 ని॥.... దర్శకులు : బూస్ మలాకొ.

✠ ✠ ✠

## ఇరాన్
## (Iran)
## సైక్లిస్ట్
## (The Cyclist)

ఆస్పత్రిలో వున్న తన భార్య ప్రాణాలు కాపాడగలిగేటంత డబ్బు సంపాదించేందుకు, అఫ్ఘన్ కాందిశీకుడు నశీమ్, వారం రోజులు నిర్విరామంగా సైకిల్ తొక్కే ఫీటు చేస్తానంటాడు. ఈ నశీమే ఇండియాలో కళ్లలో రైలు ఆపేశాడు. పాకిస్తాన్‌లో కనుసైగతో మోటారు ఆపేశాడు - అంటూ పబ్లిసిటీ చేస్తాడు ఈ వ్యవహారం నిర్వహించే ఏజంటు. పాకిస్తాన్ వరదబాధితుల నిధి కోసం, ఆఫ్ఘనిస్థాన్‌లో పదిరోజులపాటు నిర్విరామంగా సైకిల్ తొక్కేందుకు పూనుకుని, ఏడోనాడు మరణించిన ఒక వ్యక్తి ఉదంతం ఆధారంగా తీసుకు ఈ చిత్రం నిర్మించారు. ఆ వ్యక్తి చనిపోయిన కారణంగా అనుకున్న దానికంటె ఎక్కువ మొత్తం వరదబాధితుల కోసం వసూలు చేయగలుగుతారు. ఇక్కడ నశీమ్ నేల కొరగడు. ఇతని జయాపజయాలపై వేర్వేరు వ్యక్తులూ పార్టీలూ కాసిన పందేల ఫలితంగా, నశీమ్‌కి పుష్కలంగా డబ్బు వస్తుంది - అతని భార్య బతికి బట్టకడుతుంది.... 85 ని॥.... దర్శకులు : మొహ్‌సెన్ మఖలంపాల్.

❀ ❀ ❀

## ఇటలీ
## (Italy)
## ప్రేమ జల్లు
## (Moments of Love)

ముప్ఫయేళ్ల థియొడొరా ఒక వివాహితుని నమ్ముకునుంటుంది. అతను ఆమె ఇంటి అద్దె చెల్లిస్తూ అవసరాలన్నీ కనిపెట్టి చూస్తూ వుంటాడు. అమాంతంగా ఒక రోజున అతను మరణించటంతో, థియొడొరా నిరాధార కాగా, అదృష్టం బావుండి, ఒక పెద్దాయన ఈమెతో వొప్పందం కుదుర్చుకుంటాడు. తను చెప్పే చిన్ననాటి గాథలు ఈమె శ్రద్ధగా ఆలకించేటట్టు, ఈమె ఖర్చులన్నీ తను భరించేటట్టు! ఆ పెద్దాయనకు ఒక శ్రోతకావాలి; ఈమెకి ధనం కావాలి. యరేంజ్‌మెంటు దివ్యంగా సాగతూ ఉంటుంది. ఇదిలా వుండగా థియొడొరా ఒక యువకునితో చెలిమి ప్రారంభిస్తుంది -



కోళ్లఫారమ్ కోసం రెక్కలు ముక్కలయేటట్లు కష్టించే భర్తపై అధికారమే తప్ప అనురాగం చూపని భార్యనుంచి కాపాడేందుకు కంకణం కట్టుకుంటుందా వనిత - దక్షిణ కొరియా చిత్రం 'కోడిపుంజు'లో (The Rooster) - దర్శకులు : షిన్ - సుయుంగ్ - సూ. (Shin Seung Soo)

రెండుసార్లు కలుసుకుంటారు. పెద్దాయన తన కథ చెబుతూ, అక్షరాలా ఈవృత్తాంతాన్ని పోలినది వివరించగా. థియొడారా కంగారు పడుతుం . రెండుసార్లు కలుసుకున్నాక, మూడో సారి వారు ఒకటవుదామనుకున్నారు - అని ఆయన అన్నాడో లేదో ఫోన్ మోగుతుంది - థియొడారా ప్రేమికుని అభ్యర్థన అదే! .... 96 ని॥.... దర్శకత్వం : గియాన్ ఫ్రాంకొ మింగొజ్జి .... ఇటలీ నుంచి మరొక చిత్రం కూడా వచ్చింది : ఆశ్రయ మిచ్చే ఆకాశం.

✠ ✠ ✠

## జపాన్
## (Japan)
## స్వర్గ నరకాలు
## (Heaven and Earth)

16వ శతాబ్ద జపాన్‌లోని యుద్ధ ప్రభువులు, ఎవరికి వారు దేశం యావత్తుపై ఆధిపత్యం సంపాదించాలని అనుకుంటూ వుంటారు. ప్రభు హితుడు యుసామి, దుష్టుడూ అవినీతి పరుడూ అయిన హరుకాజిని తుద ముట్టించక తప్పదని చెబుతాడు కెన్ షిన్‌తో, హరు కాజి, కెన్‌షిన్‌లు సోదరులు. అయినప్పటికీ, న్యాయస్థాపన కోసం హరుకాజిని సంహరిసాడు కెన్

షిన్, కర్తవ్యం నెరవేర్చాడేగాని సోద
రుని చేజేతులా చంపాననే మనస్సం
క్షోభం నుంచి బయట పడలేకపోతాడు.
వైరాగ్యంతో దైవసాన్నిధ్యాన ప్రార్థన
జరిపే కెన్‌షిన్‌ని ఉద్దేశించి యుసామి
'ఈ మాదిరి భీరుత్వమూ, ఆత్మక్లేశమూ
పాలించే ప్రభువుకి తగదు' - అంటాడు.
చివరికి యుసామి, కెన్‌షినూ బద్ధ
విరోధులవుతారు.... 104 ని॥....
దర్శకత్వం : హరుని కడొకావా.

✠ ✠ ✠

(Malasia)

## మలేసియ

## యుద్ధవీరుడు

(Tuah)

డాటుక్‌ని, అతని కుమార్తె షారీని
గూండాల బారి నుంచి కాపాడే ప్రయ
త్నంలో ఆ అజ్ఞాతవ్యక్తికి తుపాకీ
దెబ్బవల్ల గాయమై స్మృహతప్పు
తుంది. ప్రత్యుపకారంకా డాటుక్
అతనిని హాస్పిటల్‌లో చేర్పించి,
వైద్యం చేయిస్తాడు. స్పృహ వచ్చి
రాగానే ఆ అజ్ఞాత వ్యక్తి తను 'టూ
వా' (15వ శతాబ్దినాటి యుద్ధ వీరుడు)
నంటాడు. వైద్యులతో సహా చుట్టూ
వున్న అందరూ అతని మెదడు దెబ్బ
తిన్నదని అనుకుంటారు. కాని, షారీ
మాత్రం అతను నిజం చెబుతున్నాడం
టుంది. 'నేనుండగా అతను ' టూవా'
ఎలా అవుతాడు ?' - అని మరొకతను
యితనిపై విజృంభిస్తాడు.... 110 ని॥
....దర్శకత్వం : అన్వార్ది జమీల్.

♣ ♣ ♣

(Netherlonds)

## నెదర్లాండ్స్

## అవా - గాబ్రియల్

(Ava and Gabriel)

లక్షా ఏభైవేల జనాభా గల కురా
కవొలోని ఫాదర్ ఫిడలియస్. వర్జిన్
మేరీని చిత్రించే బాధ్యత సూరినామ్
పెయింటర్ గాబ్రియల్ పై వుంచు
తాడు. అతని నలుపువర్ణమే ఆ ఊరిలో
వారి అభ్యంతరం. తన చిత్ర కల్పనకు
మిక్స్‌డ్ పేరెంటేజ్ గల అవాని మోడ
ల్‌గా తీసుకుంటాడు. ఈ అవాను ఒక
పోలీసాఫీసరు (శ్వేత వర్ణం) ప్రేమిస్తు
న్నాడు - నిశ్చితార్థం కూడా జరిగింది.
తన రూపం, వర్జిన్ మేరీ చిత్రానికి
మాతృక కావడం, అవాకు ఎంతో
గర్వంగా వుండి, కాబోయే భర్త
మాటగాని, యింట్లో వాళ్లమాటగాని
వినదు. మోడలింగ్ ప్రకరణలో,
గాబ్రియల్ కళా నిమిగ్నత అమెకు
ఆశ్చర్యమూ ఆనందమూ కలిగిస్తాయి
.... అయితే, సమాజంలోని విషపు
నాలుకలు, చుట్టూ వున్న మురికి
మనుషులూ, కళా తపనని, తపస్సుని
అర్థం చేసుకోలేని అర్భకులవటంతో,
సమస్తం గందరగోళమై వీధిని పడు
తుంది.... 100 ని॥....దర్శకులు :
ఫెలిక్స్‌డి రూయి.

✠ ✠ ✠



ఇండియన్ పెనోరమాలోని 'మట్టిమనుషులు' చిత్రనిర్మాత బి నర సింగరావు పాత్రికేయులకు ఆ పిక్చర్‌కి సంబంధించిన విశేషాలు వివరిస్తున్నారు – మీడియా సెంటర్లో

న్యూజిలాండ్
(New Zealand)
దేవత
(An Angel at my Table)

తమ్ముడికి ఫిట్సు ; చెల్లెలు విద్యుత్ తీగె తగిలి చనిపోయింది. ఈ రెండూ జానెట్ చిన్నతనంలోని షాక్స్. తన రూపురేఖలూ తెలివితేటలూ అంతంత మాత్రమే గనక, స్కూలులో గాని. కాలేజిలో గాని తన నెవరూ చెప్పుకొనే వారుకాదు. తనకు ఆత్మ న్యూనత అంతర్వీక్షణ మోతాదుకి మించి వున్నా యని ఎనిమిదేళ్ల పాటు వేరే అట్టే పెట్టారు. ఆరోజుల్లోనే తనకి పొయిట్రి రాయాలనిపించింది- ఒక సాహితీమైత్రి అందుకు దోహదం చేసింది. సంచల నాత్మక నవలతో ట్రావెల్ గ్రాంట్ సమకూడి, యూరప్ వెళ్ళింది. జంకు గొంకులు వొదిలేసి, స్వేచ్ఛా వాయు వులు పీలుస్తూ, తన కిష్టమొచ్చిన రీతిలో, హాయిగా బతికింది - ఎటువంటి బంధాలలోనూ యిరుక్కోకుండా ! అనుకోకుండా ఒకసారి నెల తప్పగా, కాలాతీతకాక పూర్వమే జాగర్త పడింది. ఆతర్వాత లండన్ వెళ్లి స్థిరపడి రచ యిత్రిగా పేరు తెచ్చుకుంది. తండ్రి మరణాంతరం చిన్ననాటి గూటికి చేరుకోక తప్పలేదు - అదీ జానెట్ ఫ్రేమ్ జీవితకధ .... 150 ని॥.... దర్శకులు : జేన్ కాంపియాన్.... న్యూజిలాండ్ నుంచి వచ్చిన మరొక చిత్రం :రూబీ అండ్ రాటా,

## నార్వే
## (Norway)
## గుప్పెడు కాలం
## (A Handful of Time)

వృద్ధుల వసతి గృహంలో ఉన్న మార్టిన్‌కి, ఏభైఏళ్ల క్రితం గతించిన తన భార్య యానాతో మాట్లాడటం అలవాటు. దానినెవరూ అంతగా పట్టించుకొనేవారు కాదు. ఒక వసంత కాలంలో అతను ఆ 'హోలేజ్ హెూమ్ నుంచి పదిహేను రోజులపాటు తప్పించుకు పారిపోతాడు అది ఒక విధంగా అతని వెనకటి రోజుల స్మృతిమాల. ఆ స్మృతిమాలనుంచి విస్మయ కాంతులతో వెలువడుతుంది - వారిద్దరి ప్రేమానుబంధం.... 97 ని॥ .... దర్శకులు: మార్టిన్ యాస్ఫాగ్

☘ ☘ ☘

## పోలండ్
## (Poland)
## హేమంతానికి వీడ్కోలు
## [Farewell to Autumn]

అందగాడైన అటనాజి యిద్దరు సుందరీ మణుల వలపు వాకిళ్లలో నిర్వచారంగా విహరిస్తుంటాడు. ఒకరు (హెల్గా) శృంగార దీపమైతే, మరొకరు (జోసియా) చల్లటి నీడ. రెండూ కావాలనుకొనే ఆ యువకునికి, ఈ మాదిరి ఆటలు యింకెన్నాళ్లో సాగవని లీలగా తెలుసు. విప్లవశంఖం పొలిమేర దాటి ఏక్షణాన్నైనా లోన ప్రవేశించవచ్చు, అప్పుడు మనుషులందరూ క్రమతకు కట్టుబడి నడుచుకుంటారు - గొర్రెలమందలా! బుర్రలు పని చేయవు. శిక్షణపేరిట సర్వం చదునైపోవడం, అటనాజి, జోసియాల వివాహంతో ప్రారంభమై, హేమంతానికి వీడ్కోలు పలుకుతుంది.... 96 ని॥ .... దర్శకత్వం: మరియాస్ ట్రెలీన్‌స్కీ.... పోలండునుంచి మరొక రెండు చిత్రాలు వచ్చాయి: ఇంట రాగేషన్, కొర్స్జాక్.

☘ ☘ ☘

## పోర్చుగల్
## [Portugal]
## పటాటోపం
## [The Vain Glory of Command]

యూరప్ ఖండంలోని మొదటి 'నేషన్' పోర్చుగల్. అయితే, 'ఏజాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం?' పోర్చుగల్ విషయమూ అంతే! ఆఫ్రికాలోని తమ వలస కాపాడుకోవాలని తాపత్రయం.... బాగా చదువుకొన్న ఒక సైనికాధికారి, తనతోపాటు జీపులో వస్తున్న సోల్జర్లకి, తమ దేశమూ, యూరప్ ఖండమూ, ప్రాచీన యుద్ధాలూ, ఆధునిక యుద్ధాలూ - యివన్నీ చరిత్ర పేజీలు తిరగేస్తున్నట్టుగా మన కళ్ల ముందు సాక్షాత్కరింప జేస్తాడు. "నిర్బంధ సైనిక విధానంవల్ల మనం దరం వచ్చినట్టు యుద్ధాలిలో పాలొనాలి తప్ప, ఈ యుద్ధాలవల్ల వొనగూడే ప్రయోజనమేమున్నది? రాజ్యాధినేతల పాచికలాటలో మన

మేమీ చేయలేము - కాలంతో, చరిత్రలో, కరిగిపోవలసిన మంద భాగ్యలం" - అంటాడు ఆ సైనికాధికారి. 1974 ఏప్రిల్ 25వ తేదీనాటి విప్లవంతో పోర్చుగల్ తన ఆఫ్రికన్ వలసను కోల్పోతుంది.... 110 ని॥ .... దర్శకత్వం : మెనొయిల్ డి అలివిరా.

✠ ✠ ✠

దక్షిణ కొరియా
(South Korea)
కోడి పుంజు
(The Rooster)

ఇంట్లో ఆడవాళ్ల ప్రాబల్యం ఎక్కువ : భార్య అతని మాట ఖాతరు చేయదు సరిగదా, అతని పురుషత్వాన్ని కించపరిచే విధంగా ప్రవర్తిస్తుంది. కోడి పందేలలో తనని తాను మర్చిపోయే ఖాంగ్ కోళ్లఫారమూ, ఊపిరాడని దిగ్బంధమూ నుంచి ఆట విడుపు అభిలాషిస్తూండగా, వొక్జా అను 'కాల్‌గర్ల్' తటస్థపడి, యితనిని నిర్వికారంగా నవ్వగలిగే మనిషిని చేయగా, ఖాంగ్ భార్య ఈ వొక్జా యింటికొచ్చి జగడం వేసుకుంటుంది. ఖాంగ్, తన కోడిగుడ్ల వాన్‌తో, ఆ సరుకు అమ్మేందుకు పట్నం వెళ్తూండగా, దారిలో ఒక రాజకీయ ప్రదర్శన ఎదురై గుడ్లన్నీ ప్రదర్శకుల చేతుల్లో బంతులవుతాయి ; వాన్ ధ్వంసమవుతుంది.... తన ప్రపంచం కూలిపోయినట్లు బాధపడుతున్న ఖాంగ్‌కి, వొక్జా



దక్షిణ కొరియా చిత్రం 'పీ-మాక్'లో
(Pee - Mak)

ఒక కొత్త మోటారువాన్ ప్రజెంట్ చేయడంతో అతనికి నవోదయమైనట్లనిపిస్తుంది.... 109 ని॥.... దర్శకులు : షిన్ సియింగ్ సూ.

✠ ✠ ✠

స్పెయిన్
(Spain)
డాన్ జువాన్
(Don Juan, My Dear Ghost)

16వ శతాబ్ది యూరప్‌లో, నారీజన మానసచోరుడైన డాన్ జువాన్, తన వలపుతూపులతో అనేక మంది వనితలను వంచించి, 444 ఏళ్ల నరకవాసాన గడిపి, 1990 నవంబరు ఒకటో తేదీన ఇరవైనాలుగు గంటల పాటు ఈ భూలోకం ఎలా ఉందో

చూదామనుని వస్తాడు. సరిగ్గా అతను వచ్చే సమయానికే సెవిల్లాలోని ఒక నాటకం కంపెనీలో, మార్క్వినా అనే ప్రఖ్యాత నటుడు - ఇరవైఏళ్లగా డాన్‌జువాన్ పాత్రను ఎంతో గొప్పగా పోషిస్తున్న నటుడు - ఎదురవుతాడు. ఒకరు రూపం - మరొకరు ప్రతి రూపం. ఇందులో ఏది నిజం?.... 103 ని॥.... దర్శకులు: క్వేరిడొ ఫాంటాస్మా.... స్పెయిన్ నుంచి వచ్చిన మరొక చిత్రం: నన్ను కట్టేయండి.

* * *

## సోవియట్ యూనియన్ (USSR)

## జీరో సిటీ (Zero City)

అదొకకల్పితనగరం. దానికి దేశపు ఎల్లలు, భాషల అవధులు లేవు. వరాకిన్, తన ఫాక్టరినుంచి మరొక ఫాక్టరీకి వెళ్లి, డిజైన్ మార్పు సూచిస్తాడు. అక్కడి స్టెనో వొంటిమీద నూలు పోగు లేకుండా కూచుంటుంది. కాని, ఎవరూ పట్టించుకోరు, తమ ఫాక్టరీ ఛీఫ్ ఇంజనీరు ఎనిమిది నెలల క్రితం నీటిలో మునిగిపోయాడంటుంది .... వరాకిన్ ఒక హొటల్ కెళ్తాడు. తన అరచేతిని పోలిన కేక్ సర్వ్ చేస్తారు.... ఏదో హత్య.... ప్రజాస్వామిక విజయం పేరిట పండగ.... అనేక సన్నివేశాలు ఒకదానితో ఒకటి పొంతన లేకుండా వున్నట్లు కనిపిస్తాయి.... మంచీ చెడూ మిళితమై....కాలం మారవచ్చు; పైపై ఆకారాలు మారవచ్చు. కాని, చరిత్రను ముందుకి నెట్టే శక్తులలో మార్పులేదు .... 102 ని॥.... దర్శకత్వం: కారెన్ షాక్నజెరొవ్.

## శ్రీలంక (Sri Lanka)

## భవంతి (The Mansion)

వొంటి నిండా కట్లతో హాస్పిటల్ నుంచి వస్తాడు తమ్ముడు సంపత్. అన్నా వొదిన లిద్దరూ (సిరిల్-నిర్మల) జాలి పడతారు, పనిపిల్ల లీల, సంపత్‌కి సర్వోపచారాలు చేస్తూ వుంటుంది. అతను స్నానం చేయలేడు, బట్టలు కట్టుకోలేడు, నోటికి అందించాలే గాని తనకిగా తాను తినలేడు. లీల అతనిని కంటికిరెప్పలా కాపాడుతూ వుంటుంది. సంపత్‌కి యిష్టమైన మ్యూజిక్‌ని ప్రోత్సహిస్తారు అన్నా వదినలు. మ్యూజిక్ బృందం మిత్రుల సహకారంతో ఇతని చేత సంగీత కచ్చేరీ యిప్పిద్దామను కుంటారు. సంపత్ తను అవిటివాడ నయానని అనుకోకూడదు - అతనికి మనోబలం చేకూరాలి. పనిపిల్ల లీల, మరిదికింత చేరువవడం యిష్టంలేని నిర్మల, వంశ గౌరవం సాకుతోనయితే నేమి, తనలో లీల పట్ల ఏర్పడ్డ జెలసీ వల్ల నయితేనేమి, మరిదికి తనే ఉపచారం చేస్తూ, జట్టు కడుతుంది. ఇంతటి నైచ్యానికి వొడబట్ట యజమానురాలు నిర్మలని, ప్రియుడు సంపత్‌ని తుపాకీతో కాల్చేసి, భవంతి ముందు నిలబడ్డ

కార్మికుల గుంపులో కలిసిపోతుంది లీల .... 160 ని॥.... దర్శకులు : పరాక్రమ నిరియెళ్ల.

⊕ ⊕ ⊕

స్విట్జర్లాండ్
(Switzerland)
కాటలాగ్ పెళ్లి
(Woman from Rosehill)

స్విట్జర్లాండ్‌లోని వాయుట్ ప్రాంతానికి చెందిన కర్షకుడు మార్సెల్. హిందూమహా సముద్రంలోని ఒకానొక ద్వీపానికి చెందిన నల్లరంగు యువతి జూలీ. పెళ్లిళ్ల ఏజన్సీ వీరిద్దరికీ పరస్పర పరిచయం సమకూర్చింది. అతనికి యిల్లు చూసుకొనే ఆడమనిషి కావాలి; ఇక ఆమెకి తనని అంటిపెట్టుకునుండే మగవాడు కావాలి. ఇద్దరూ ఉత్తరాలు రాసుకున్నారు; ఫోటోగ్రాఫులు పంపించుకున్నారు. ఫిబ్రవరి అయిదో తేదీన మొదటిసారి కలుసుకున్నారు: పన్నెండో తేదీన పెళ్లి చేసుకున్నారు; పెళ్లిళ్ళు స్వర్గంలో జరిగేవైనా, భూమ్మీద ఏజన్సీ ముద్రపడాలి.... 95 ని॥.... దర్శకులు: యలైన్ టానర్.... స్విట్జర్లాండ్ నుంచి వచ్చిన మరొక చిత్రం : ఏంజిల్స్.

⊛ ⊛ ⊛



గ్రీకు ఫిలిమ్ 'వోల్గా రాబర్డ్స్'లో
(Olga Robads)

టర్కీ
(Turkey)
బ్లాక్‌వుట్
(Blackout Nights)

రెండవ ప్రపంచ యుద్ధానంతరం వెలువడిన ముస్తాఫా కవితా సంపుటి అధికారులకి కంటక ప్రాయంగా ఉంటుంది. వాతావరణంలో కమ్యూనిజమ్ పవనాలు వీస్తున్నాయి. కాని, ముస్తాఫా తన కవితలో, రాజకీయ సిద్ధాంతాల కంటె వ్యక్తి ప్రధానమన్నాడు. 'వ్యక్తి స్వాతంత్ర్య మంటూ వేరేగా లేదు; సామాజికాభ్యుదయంలో వ్యక్తి ఒక భాగం' - అనే ప్రభుతని తప్పించుకు తిరుగుతాడు. అతనిని, అతని భార్యని అధికారులు హింసిస్తారు. కాలమే సమాధానం చెప్పాలనే ఓర్పుతో శుభోదయంపై గల విశ్వాసాన్ని వీడనాడడు

ముస్తాఫా.... 109 ని॥.... దర్శకులు : యూసఫ్ కుర్సేని.

✠ ✠ ✠

### యుగోస్లావియా
### [Yugoslavia]
### కుడజ్
### [Kuduz]

జైలు నుంచి అప్పుడే విడుదలైన కుడజ్‌పై కన్నేస్తుంది అందాల బామ బదేమా. తండ్రెవరో తెలియని అయిదేళ్ల బాలిక వుందామెకి. ఈమె చిన్నది, అతను వయసులో కొంచెం పెద్దవాడు. ఇద్దరూ యిష్టపడి పెళ్లి చేసుకుంటారు. కాగా యిద్దరిదీ చెరొక లక్ష్యం. బిజినెస్‌లో స్థిరపడాలని అతనికి, స్థానిక కఫెలో చేరి ఖుషీగా గడపాలని ఆమెకు. 'నీకా వుద్యోగం ఎందుకు ?' అని భర్త, భర్త తరపు బంధువులు శతవిధాల నచ్చచెప్పే ప్రయత్నం చేసినా, ఆమె వినిపించుకోదు. బదేమా కూతురు, తండ్రెవరో తెలియని ఆ అయిదేళ్ల బాలిక, కుడజ్‌కి అతని బంధువులందరికీ అనురాగ బంధమవుతుంది. బదేమా మరణంతో, కుడజ్ దుఃఖ సాగర వీచికల మీద వెన్నెలకెరటం ఈ అయిదేళ్ల బాలిక.... 113 ని॥.... దర్శకత్వం: అదెమిర్ కనొవిక్.... సిరియా నుంచి వచ్చిన 'పగటి చుక్కలు', వెంజోలాదిరయొ నీగ్రో, జింబాబ్వేది 'కన్యా శుల్కం' — యివి చూసే అవకాశం లేకపోయింది.

✠ ✠ ✠

## ముగింపు చిత్రం

### ఇండియా
### [India]
### శాఖా - ప్రశాఖా
### [Branches of the Tree]

'కృషియే దైవము, నిజాయితీయే రాచబాట' అని త్రికరణ శుద్ధిగా నమ్మిన ఆనందమోహన్ పంథొమ్మిదో ఏట నుంచి కష్టపడి పైకొచ్చిన వ్యక్తి - కంపెనీలో గుమాస్తాగా ప్రవేశించి డైరెక్టరుగా రిటైరై, తన సంపదను సమాజోన్నతికి వెచ్చించిన సుజన జీవనుడు. ఆ ఊరుని ఆయన పేరు మీదుగా ఆనందపూర్ అని మారుస్తారు. డెబ్భయ్యవ జన్మదినోత్సవ సందర్భంగా ఆయన సేవా నిరతిని మెచ్చుకుంటూ ఒక గ్రంథం వెలువడుతుంది. ఆ సంతోష సమయాన అకస్మాత్తుగా ఆయనకు గుండెపోటు వస్తుంది. అడదిక్కు లేని విశాల భవంతితో, తండ్రితోపాటు వున్న ప్రశాంత్‌కి మతిభ్రమణ. తండ్రికి 'యటాక్' వచ్చిందని చూడటానికి వస్తారు మిగతా ముగ్గురు కొడుకులు ; ఇద్దరికి పెళ్లిళ్లయాయి ; మూడో అతను వున్న ఉద్యోగం వొదులుకు, థియేటర్‌పై దృష్టి మరలుస్తాడు. అనందమోహన్ తండ్రి, తొంభయేళ్లవాడు, గదిలో నుండి పారిపోకుండా పట్టుకోవలసిన డ్యూటీ ఇంటినౌకరుది. సెలవు పెట్టి వచ్చిన ప్రబోధ్‌కీ, అతని పెద్ద తమ్ముడికీ తండ్రికి ఎప్పుడు తేలికగా ఉంటుందా, ఎప్పుడు వెళ్ళిపోదామా ? —



పట్టణాలలో లేచే భవంతులకు రాళ్లెత్తే కూలీలు ఆ యిద్దరూ, మేస్త్రీ కనుసన్నలని బట్టి నడుచుకోవలసిన 'కనస్ట్రక్షన్ లేబర్'లో బేగ్, అర్చన - లిటిల్ ఇండియావారి 'మట్టి మనుషులు'లో (Matti Manushulu) దర్శకత్వం: బి నరసింగరావు. (B. Narasing Rao)

అని తొందర. మతిలేని వానిగా కనిపించే ప్రశాంత్, కుటుంబంలోని అందరి మనసులు అవలీలగా చదవగలడు. ముత్తాత, తాత, మనుమడు. కోలుకుంటున్న తాతగారిని అయిదేళ్ల మనుమడు అడుగుతాడు; 'నల్లడబ్బు, తెల్లడబ్బు అని నాన్నా బాబాయీ చెప్పుకుంటున్నారు. ఎర్రడబ్బు, నీలండబ్బు కూడా ఉంటాయా ?'.... ఆ ప్రశ్న ఆనంద మోహన్‌నే కాదు, మనని కూడా నిశ్చేష్టులు గావిస్తుంది.... 120 ని॥ .... దర్శకత్వం : సత్యజిత్ రే.

**36 దేశాల నుంచి .... అమెరికా 3, ఆస్ట్రేలియా 2, జకొస్లొవేకియా 2, ఫ్రాన్సు 2, మిగతావి ఒకొక్కటి. మొత్తం .... 45 చిత్రాలు.**

## వి.

పదమూడో ఏట బాలగంధర్వ నాట్యమండలిలో చేరి, స్త్రీ పాత్రలు వేసిన శాంతారామ్, పంథొమ్మిదో ఏట మహారాష్ట్ర ఫిలిమ్ కంపెనీ బాబూరావు పెయింటర్ వద్ద అసిస్టెంట్‌గా చేరి, 1929 జూన్‌లో ఫతేలాల్, దామ్లె, కేశవరావులతో కలిసి, పూనెలో ప్రభాత్ ఫిలిమ్స్ స్థాపించి, దుర్గా ఖోటె నాయికగా 'అయోధ్యరాజు' చిత్రం నిర్మించాడు. ఆ తర్వాత సైరంధ్రి, అమృతమంథన్, అమరజ్యోతి, అద్మి, పడోసి, బొంబాయిలో రాజ్‌కమల్. (తండ్రిపేరు రాజారామ్, తల్లిపేరు కమల) స్థాపించాక, శాకుంతల, ఝనక్ ఝనక్ పాయల్ బాజె, నవరంగ్, దో ఆంఖె బారా హాత్ నిర్మించి, ఎనభైలలో ఏభైఆరు చిత్రాలు స్వంతంగా డైరక్ట్ చేశారాయన. సామాజిక చైతన్యానికీ, ప్రగతికీ వెండితెర ఉపయోగపడాలని అవిరళకృషి గావించిన సినీకళా తపస్వి వి శాంతారామ్.... ఫెస్టివల్‌లో : డాక్టర్ కొట్నీస్, దో ఆంఖె....

## యస్ ముఖర్జీ

అలహాబాదు యూనివర్సిటీలో ఫిజిక్స్ యమ్.ఎ. పాసై, స్వస్థలం ఝాన్సీలో కొన్నాళ్లు లెక్చరరుగా పనిచేసి, ఏభై ఎనిమిదేళ్ల క్రితం బొంబయి చేరుకున్న శశిధర ముఖర్జీ, బంధన్, ఝూలా, కిస్మత్‌లతో (బొంబయి టాకీస్ చిత్రాలు - ఆ తర్వాత ఆయన ఫిలిమ్‌స్తాన్ స్థాపించారు), చల్ చల్‌రె నౌజవాన్, సిందూర్, నాగిన్, జాగృతి వంటి చిత్రాలతో, సాటిలేని మేటి అనిపించుకున్నారు. ముంతాజ్ శాంతి, లీలా చిట్నీస్, బినారాయ్, కామినీ కౌషల్, షమ్మీకపూర్, జోహర్, బర్మన్, హేమంతకుమార్, ఉషాఖన్నా యిలా ఎందరెందరినో వెలుగులోకి తెచ్చి లోకం ముందు నిలబెట్టిన ఘనత యస్ ముఖర్జీది.... ఫెస్టివల్‌లో : అనార్కలి, కిస్మత్.

## అరుంధతీదేవి

చిన్నతనాన శాంతినికేతన్‌లో రవీంద్ర సంగీతం తన్మయత్వంతో పాడుకుంటూ గడిపిన అరుంధతీదేవి, కలకత్తా యూనివర్సిటీలో ఎమ్ఏ ఎకన మిక్స్ పాసై, 'ఆకాశవాణి' తర్వాత బెంగాలీ ఫిలిమ్ పరిశ్రమలో ప్రవేశిం చారు. ఆమె నటించిన మొదటి పిక్చర్‌కే (మహాప్రస్థాన పథం) అవార్డు వచ్చింది. మొత్తం ముప్ఫయ్యయిదు సినిమాలలో నటించి ఏడుసార్లు ఉత్తమ నటిగా బహుమతి అందుకు, మొదటి దర్శకత్వ ప్రయత్నమే ఎడింబరో ఫెస్టి వల్‌లో గుర్తింపు పొందగా, రెండవ చిత్రానికి మాస్కో ఫిలిమ్ ఫెస్టివల్‌లో అవార్డ్ అందుకున్నారు. ప్రఖ్యాత ఫిలిమ్ డైరక్టర్ తపన్ సిన్హా భార్య ఈమె. చిత్రోత్సవంలో అరుంధతీదేవి పిక్చర్లు : సెలవు, క్షుధిత పాసమ్.

## మన్‌మోహన్ కృష్ణ

దేశ విభజనకు పూర్వం లాహోరులో ఫిజిక్స్ లెక్చరరుగా వున్న మన్ మోహన్ కృష్ణ భాధాని బొంబయి ఆకర్షించింది. శాంతారామ్, అంధన్‌కి దునియా, రామశాస్త్రి చిత్రాలలో అవకాశం యిచ్చారు. రెండు వందల చిత్రాలలో నటించిన మన్‌మోహన్ కృష్ణకు రంగస్థలమంటే అభిమానం. ఇండియన్ పీపుల్స్ థియేటర్ ఎంతో అభిమాన పాత్రం. సినీకళాకారుల సంఘా నికి చాలాకాలం పాటు అధ్యక్షులు .... ఫెస్టివల్‌లో : నూరి, ధూళిలో పుష్పం.

## శంకర్‌నాగ్

బాంక్ క్లర్క్‌గా జీవితం ప్రారంభించి, 1979 లో గిరీష్ కర్నాడ్ దర్శకత్వం వహించిన 'ఒండనొండు కలదళ్లి'తో సినీరంగాన ప్రవేశించి, ఈ పదకొండేళ్లలో 85 చిత్రాలలో నటించిన శంకర్‌నాగ్ నిర్మించిన 'యాక్సిడెంట్' పిక్చర్‌కి జాతీయ బహుమతి లభించింది. ఆర్‌కె నారాయణ్ 'మాల్‌గుడి డేస్' విడియో ద్వారా అంతర్జాతీయ మార్కెట్‌కి అందజేసిన శంకర్‌నాగ్, 36 ఏళ్ల చిన్నవయసులో, కారు ప్రమాదంలో మరణించడం సిని పరిశ్రమకే తీరని లోటు .... ఫెస్టివల్‌లో : యాక్సిడెంట్, అనగా అనగా ఒకప్పుడు.

## హిందీ
## [Hindi]
## గులాబీ పావురం
## [Ankur, Maina Aur Kabootar]

మారిషస్‌లోని గులాబీ పావురం జాతి నిషారణంగా నశిస్తోందనీ దానిని ఎలాగైనా కాపాడాలని పట్టుదలతో వున్న డాక్టర్ సిన్హా ఆ దీవికి వస్తాడు. మారిషస్‌లోని విహంగ పరిశోధకుడు శర్మ, అతని అసిస్టెంట్ మణిలాల్ యితనికి సహాయంగా ఉంటారు. వెంటవచ్చిన మనుమడు అంకుర్, శర్మ కుమార్తె మైనా ఫ్రెండ్సవుతారు. డాక్టరు సిన్హా అటవీ గ్రామంలోని రెస్ట్ హవుజ్‌లో ఉంటూ, ఫారెస్ట్‌లోకి వెళ్లి ఈ గులాబీ పావురం ఉనికి తెలుసుకు పావురాల జంటను పట్టి తీసుకొస్తాడు. ఆ సంతతి పెంచడమనేది స్థానికులకి అంతగా యిష్టం వుండదు - ముఖ్యం గా మంత్రకత్తె జోజోకి. సిద్ధాన్నం పడగొట్టే ప్రయత్నం జరుగుతుంది గాని తాతగారికి తగిన మనుమడినని పించుకుంటాడు అంకూర్.... విహంగ విజ్ఞాని సలామ్ ఒకానొక పక్షి సంతతిని కాపాడాలని ప్రయత్నించి విఫలుడవుతాడు. కాని, ఇక్కడ డాక్టర్ సిన్హా విజయం పొందడం ఆశావాదానికి పట్టం గట్టడంగా భావించవచ్చు ... 93 ని॥.... దర్శకత్వం: మదన్ బవారియా.

## దృష్టి
## [Vision]

బాల సాహిత్యం వేసే పబ్లిషింగ్ కంపెనీలో పని చేస్తోంది సంధ్య: మల్టినేషనల్‌లో రిసెర్చి సైంటిస్ట్‌గా ఉంటున్నాడు నిఖిల్. చదువూ సంస్కారం ఆర్జన గల అప్పర్ మిడిల్ క్లాస్. ఎనిమిదో వెడ్డింగ్ యానివర్సరీ రోజున, తెలిసిన ఫ్రెండ్స్‌తో వచ్చిన రాహుల్‌ని చూసీచూడగానే ఆకర్షితురాలవుతుంది సంధ్య. ఈ యఫైర్ యిక్కడితో ఆపెయ్ - అని ప్రభ మందలించేదాకా, రాహుల్‌తో సంబంధం పెట్టుకుంది. భర్త మీద ప్రేమ, గౌరవమూ లేక కాదు; రాహుల్ విషయంలో ఏర్పడ్డ ఆకర్షణ జయించలేక అలా చేసింది. సంధ్యకు నెల తప్పుతుంది. లోగడ ఒకరు చాలనుకున్నారు గనక యబార్షన్ చేయించుకోవలసివస్తుంది. క్రమేపీ యిద్దరి మధ్యా గోడలు మొలుస్తాయి. తమ ఆఫీసులో పనిచేస్తున్న బృందా, తనూ ఎంతో చేరువయామనీ, విడాకులు తీసుకు విడిపోదామనీ సంధ్యతో అంటాడు నిఖిల్. 'నా సంపాదన నాకు వున్నది — ఒంటరిగా బతకలేనా ?' అని వొప్పుకుంటుందామె. బృందా, నిఖిల్ ఏడాది తిరక్కుండా ఎడమొగం పెడమొగం అవుతారు, సాయంసమయాన బీచిలో అనుకో

కుండా కలుసుకున్న సంధ్యని యిద్దరు ఫ్రెండ్స్ పిచ్చాపాటీ మాట్లాడు కుంటున్నట్టు ఆ ధోరణిలో అడుగుతాడు నిఖిల్ : 'ఆ రెండోసారి - రాహుల్‌దా ?'.... 'కాదు - మా శైలేే' - అని నిజం చెబుతుంది సంధ్య ....పదకొండు సన్నివేశాలలో, స్మృతి మాల గుచ్చుతూ సంగీత ధారతో చెప్పిన యితివృత్తం.... 171 ని॥.... దర్శకులు : గోవింద్ నిహలాని.

## రొమాన్స్
## (Thodasa Roomani Ho Jayen)

ముప్ఫయ్యేళ్లు పైబడ్డ బిన్నీకి యింకా పెళ్లి కాలేదు. అత్త తెచ్చేవీ, పెళ్లిళ్ల పేరయ్యలు చెప్పేవీ ఆమెకి నచ్చవు. ఏ ప్రిన్స్‌ఛార్మింగూ ఆమెకి తటస పడలేదు. మగపని, ఆడపని చేసే బిన్నీకి పెళ్లి గురించి చీమకుట్టిన చింతకూడా లేదు. రాయ్ కుటుంబం హాయిగా నిర్విచారంగా తమ దారిని తాము బతుకుతున్నారు. ఆ ఏడు వర్షాలు లేకపోవడంతో పంటలు దెబ్బ తినేటట్టు వున్నాయి.... మాయ మాటలు చెప్పే ఒక ఆగంతకుడు అక్కడికొచ్చి, తను వర్షం కురిపిస్తా నంటాడు. ఇంటిల్లపాదీ అతనిని నమ్ము తారు – బిన్నీ ఒక్కతె తప్ప! ఈ అంతర్ రాష్ట్రీయ గజదొంగని బిన్నియే జాలిపడి, కడపటి క్షణాన రక్షించి, కొండలవతలకి సాగనంపు తుంది.... 160 ని॥ దర్శకత్వం : అమోల్ పాలేకర్.... హిందీలో ఈ మూడుగాక మరొక అయిదు : ఏక్ డాక్టర్...., లెకిన్, దిషా, కాస్బా నాజార్.

## కన్నడ
## (Kannada)
## నివాసం
## (The Dwelling)

పట్నంలో ఉద్యోగం సంపాదిం చిన రాజన్న, తన భార్య గీతతో కాపరం పెడతాడు. ఒక రేకుల షెడ్డుని అంటిపెట్టుకున్న ఆ వాటా, మొదట్లో బావున్నట్లుంటుంది 'గాని, షెడ్డులోని శబ్దాలతో రాత్రిళ్లు నిద్ర వుండదు. ఎంత సర్దుకు పోదామన్నా సాధ్యం కాదు. రాజన్న కార్పొరేషన్ అధికారులని చూస్తాడుగాని ప్రయో జనం శూన్యం. ఇంటి యజమాని కూడా ఈ విషయంలో అశక్తుడు. చెడిపోయిన మనిషిగా పేరుబడ్డ ఆంటీ ఒక్కతె, తమని ఈ వూబి నుంచి లేవనెత్తగలదని భార్యా భర్తలిద్దరూ ఆమె ఇంటికి వెళ్తారు. ఇల్లు దర్జాగా ఉంటుంది - ఇంట్లో ఆమె ఫ్రెండు (పోలీసాఫీసరు) వుంటాడు. 'అదెంత సేపు' అని మాట యిచ్చిన పోలీసా ఫీసరు షెడ్డునైతే ఖాళీ చేయిస్తాడు గాని, అది అతని మేనల్లుడి 'విడియో గేమ్స్ పార్లర్' అవుతుంది. ఆ శబ్దాల కంటె యిది యింకా ఘోరం. లోక వృత్తం నెమ్మది నెమ్మదిగా తెలుసు కుంటున్న గీత, పోలీసాఫీసరుని మంచి చేసుకు, 'విడియోగేమ్స్‌ఫార్లర్' మూయించేస్తుంది. రాజన్నకి అంతా అగమ్యగోచరమై, వెనక తెలిసిన వారు

ఏ స్లమ్‌లో వున్నారో చూదామని రైలు కట్ట దాటివెళ్ళగా, ఒక 'మల్టీనేషనల్' కోసం ఆ స్లమ్‌ని బుల్‌డోజర్లునేల మట్టం చేస్తూండటం కనిపిస్తుంది.... 125 ని॥ దర్శకత్వం : గిరిష్ కాసర్‌వళి.

### కార్బి
(Karbi)
### కోకిల పిలుపు
(The Cuckoo's Call)

సార్తె ఒక స్కూలు టీచరు. తాత చెప్పిన కథలు, తండ్రి జ్ఞాపకాలు, చుట్టూవున్న చెట్టు చేమా, పక్షుల కూజితాలు, ప్రకృతి వొడిలో నిద్రిస్తున్నట్లు తమ గ్రామమూ - యివేవీ వొదిలి పెట్టలేడు. ఈ దారిద్ర్యమూ భరించలేడు. బయట ప్రపంచపు బాధలు తనని తాకకుండా వుండేందుకు అంతరంగ యానం చేస్తాడు. స్మృతి సౌరభంలో మనసు కేరింతలు కొడుతున్నప్పుడు బావుంటుంది. కాని, ఆ దాగుడు మూతలాట ఎల్లకాలం కుదరదు. ఈ కుగ్రామం వొదిలి పట్నం పోతే సుఖంగా బతకవచ్చు. ఒకసారి వెళ్లిపోదామనే నిర్ణయానికి వస్తాడు. కాని, ప్రాచీన బంధాలు కాళ్లకి అడ్డంతగులుతాయి. కోకిలపాట వినిపించని చోట, అదీ ఒక బతుకేనా - అనిపిస్తుంది.... 138 ని॥.... దర్శకులు : గౌతమ్ బోరా.



మళయాళ చిత్రం 'ఒట్టయడిప్పతకాల్'లో (Ottayadippathakal)

### మళయాళం
(Malayalam)
### అపరాహ్ణమ్
(The Late Afternoon)

ఈ శతాబ్ది అరవైలలో, కేరళలోని చాలామంది విద్యాధిక యువకుల మాదిరి నందకుమార్ నక్సలైట్లలో చేరి, కొన్నాళ్లు జైలు శిక్ష అనుభవించాక విడుదలవుతాడు. తండ్రిలేడు; తల్లి స్కూలు టీచరు; ఒక్కగానొక్క కొడుకు ... అమ్మకి తోడుగా వుండటం తన కర్తవ్యం అనుకొని, ఉద్యోగంలో చేరుతాడు. కాని, ఆ టీచింగ్ జాబ్ ఎక్కువ రోజులు నిలుపుకోలేక పోతాడు. వెనకటి కాలేజీ మేట్ లతిక, నందకుమార్ పై అభిమానం చూపి, తనతో వుండిపోకూడదా అంటుంది. కాని, ఉద్యమ

ప్రభావం యితవిని స్థిమితపడనీయదు. కామ్రేడ్ రామన్ ఒక సాయింత్రం వీరింటికి వచ్చి, వెలుగురాక పూర్వమే వెళ్లిపోతూ, తన తండ్రి ఎలా వున్నాడో చూసి రమ్మంటాడు. ఆ తండ్రి, తన కొడుక్కి అందజేసేందుకు కొంతడబ్బు ఈ నందకుమార్ ద్వారా పంపుతాడు. డెబ్భయిలలో ఎమర్జన్సీ ప్రకటించ గానే నందకుమార్ని కటకటాల మధ్యకి పట్టుకు పోతారు. అతను జైలులో వుండగానే తల్లి మరణిస్తుంది. గల్ఫ్‌కి రమ్మని వెనక పిల్చిన మిత్రుడు మళ్లీ పిలుస్తాడు. ఆదుకునేందుకు నేను న్నాను' అంటుంది లతిక. కాని, నందకుమార్ జీవితం పగిలిన స్వప్న కలశం.... 136 ని॥.... దర్శకులు : సుకుమారన్ నాయర్. మళయాళంలో మరొక మూడు : తజాహ్ వరమ్ వెంబానాడ్, ఒట్టయడప్పతకాల్.

## మణిపురి
## (Manipuri)
## మురళీ రవం
## (The Chosen One)

మణిపురిలోయ లోని ఒకానొక ఊళ్లో తంపా, ఆమె భర్త ఎంతో సంతోషంగా అయిదేళ్ల ఆడపిల్లకు చెవులు కుట్టిస్తారు ఆ వేడుక ఘనంగా జరుగుతుంది. స్కూటర్ కొనుక్కో వాలని వుందని భర్త అనేసరికి, తన బంగారం అమ్మి కొనుక్కోమంటుంది తంపా. అత్తగారు ఆమెని ఎంతో ప్రేమాభిమానాలతో చూసుకుంటూ వుంటుంది.... దూరాన్నుంచి ఏదో మధురగానం వినిపించడంతో, ఏదో పిలుపు తనని నిలువనీయక పోవ డంతో, నిద్దరలోనుంచి లేచి నడిచి వెళ్లిపోతూంటుంది తంపా. భర్త కంగారుపడి పట్నం డాక్టరుకి చూపి స్తాడు. కాని అత్తగారు మాత్రం యిది 'మైబి' అని దీనంగా వాపోతుంది. 'మైబి' అనగా ఈ సంసార తాపత్ర యానికి అతీతంగా భగవదర్పితమైన నామ జపం - నృత్యాంజలి. ఆనన్యాసినులది ఒక ప్రత్యేకలోకం. తంపా దీక్ష పుచ్చుకుంటుంది - మైబీ లలో ఒకతెగా మారిపోతుంది. భర్త మరొకామెను పెళ్లి చేసుకుంటాడు ; కూతురికి పది పన్నెండేళ్లునడుస్తాయి. మైబీల ఉత్సవానికి తండ్రీ కూతురూ వచ్చినప్పుడు. తంపా మనసు కించిత్ చలిస్తుందిగాని, రెండూ వేర్వేరు ప్రపం చాలు - ఎవరిదారి వారిది, ఎవరి భాష వారిది, ఎవరి మనసు వారిది.... 94 ని॥.... దర్శకత్వం : శ్యామ్‌శర్మ.

## తమిళం
## (Tamil)
## సంధ్యారాగం
## (The Evening Raga)

చొక్కలింగం భాగవతార్ నలభై ఏళ్ల క్రితం రంగస్థలం నటుడు. భార్య మరణించగా, స్వగ్రామం వొదిలి, చిన్నప్పుడు తను చదువు చెప్పించిన మేనల్లుని యింటికి వస్తాడు. వాసు, అతని భార్య, వారి అమ్మాలు – ఈ

ముగ్గురికి తోడు, పట్నం కాపరంలో మరొక మనిషి. అంతకీ ఏదో సర్దుకు పోతూంటారు. అమ్మాయిని స్కూలుకి తీసుకెళ్ళడం, తీసుకురావడం ఈ పని తప్పుతుందికదా - అనుకుంటుంది వాసు భార్య. పసిపిల్ల అడిగింది కొని పెట్టడం దాకానే తెలుసు చొక్కలింగానికి; దుమ్మూ ధూళితో కూడిన పదార్థం పసిదాని ఆరోగ్యానికి హానికరమని తెలియక, వాసు భార్య ఆగ్రహానికి గురి అవుతాడు. మొదట్లో కోప్పడుతుంది. గాని ఆపైన తిప్పుకుంటుంది. చొక్కలింగమే నెమ్మదిగా వోల్డేజ్ హోమ్ చేరుకొని, అక్కడి వారితో కలిసిపోయి. బంధుప్రేమకు మేనల్లుడి సంసారం పట్లగల అభిమానానికి ఏవిధమైన నష్టం వాటిల్లకుండా, వాసు భార్య తనవల్లనేదో తప్పిదం జరిగిందని బాధపడనక్కర్లేకుండా తన పెద్దరికం నిలుపుకుంటాడు....84 ని॥... దర్శకత్వం: బాలు మహేంద్ర; తమిళంలోని మరొక చిత్రం: అంజలి.

తెలుగు

(Telugu)

## మట్టి మనుషులు

(Men of Glay)

పల్లెటూరిలో పొట్ట గడవక పట్నం చేరుకున్న నరసయ్యా, పోచమ్మలు కట్టడం పనిలో కూలికి కుదురుకుంటారు. తాగుడుకి అలవాటు పడ్డ నరసయ్యకి పట్నం బావుంటుంది గానీ



ఫ్రెంచి చిత్రం 'సిరానో డి బెర్జిరాక్'
(Cyrano De Bergerae)

పోచమ్మకి మాత్రం అర్ధాకలి బతుకులైనా తమ గ్రామమే మేలనిపిస్తుంది. తమకంటూ ఒక గుడిసె వుండాలని కోరుకొనే పోచమ్మ, చిన్న తరహా షావుకారు దగ్గిర అప్పుజేసి, నాలుగు వందలు ఒక దగుల్బాజీ చేతుల్లో పోయిస్తుంది. గుడిసె ఏర్పడదు గాని, యిటు అప్పులవాడు, అటు కట్టడం మేస్త్రీ ఈమె ప్రాణాలు తీస్తూంటారు - యిద్దరివీ దొంగ చూపులే. వాటి అర్థం పోచమ్మకు తెలియక కాదు - తెలియనట్లుగా ఊరుకుంటుంది. ఈ లోపల నరసయ్య మరొక ఆడకూలీతో నేస్తం కడతాడు. ఇద్దరూ జల్సాగా పారిపోవడంతో, పిల్లతల్లి పోచమ్మ ఒంటరిదవుతుంది. దిక్కుమొక్కూలేని ఈ పేదవనితపై దారుణమైన అత్యాచారం జరగ్గా, ఆ షాక్‌లో పోచమ్మ చనిపోతుంది; పసిది అనాథ అవు



మొదట్లో అంతగా యిష్టపడక పోయినా అర్జున్, అనూలకు చిత్ర అంటే ప్రాణం - సుజాతావారి (Anjali) 'అంజలి'లో దర్శకత్వం: మణిరత్నం. (Mani Ratnam).

తుంది.... 87 ని॥.... దర్శకత్వం: బి. నర్సింగ్‌రావు.

## ఛాన్ - ఫీచర్

**కుట్టి జపాన్**

**(Children of Mini - Japan)**

దక్షిణ భారతంలోని శివకాశి అగ్గి పెట్టెలకి, టపాసులకి (దీపావళి ఫైర్ వర్క్స్), కొట్టొచ్చే రంగుల కాలెండర్లకి, ఎలక్షన్ పోస్టర్లకి ప్రసిద్ధి. ఈ పట్టణాన్ని మినీ జపాన్‌గా పేర్కొంటారు. పదహారేళ్లలోపు పిల్లలు, అధికంగా ఆడపిల్లలు, ఒక లక్షమంది దాకా ఈ ఫాక్టరీలలో పని చేస్తున్నారు. 'క్లాసు పుస్తకాలు పట్టుకోవలసిన వయసులో 'ఛైల్డ్ లేబర్' యింత భారీ ఎత్తున యిక్కడి పరిశ్రమలలో ఎందువల్ల పాల్గొనవలసి వస్తున్నది?' అనే ప్రశ్నకు సమాధానం లేకపోలేదు. చుట్టూ కరువు కాటకాలు, నీటి ఆధారం లోపించి పంటలు పండకపోవటం, పెద్దవాళ్లకు పనిలేక పోవటం - యిలా సామాజిక కారణాలు అనేకం ఉన్నాయి; వాటిని పరిష్కరించే సూచనలూ అన్ని వున్నాయి. ఈ చిత్రం ఛైల్డ్ లేబర్‌కి సంబంధించిన బాగోగులు చర్చించడం గాక, వర్తమానాన్ని వాస్తవికతను ప్రదర్శిస్తుంది.... 63 ని॥.... తమిళం.... దర్శకులు: చలం బెన్నేర్కర్.



పళ్లు గట్టి పడి, ముత్యాల్లా మెరిసేందుకు తమ 'ఎవర్‌స్మయిల్' టూత్ బ్రష్ వాడమని చెప్పే ఒక డెంటిస్ట్, తన సేవాకార్య క్రమంలో తటస్థపడ్డ సుందరాంగితో, అమెరికన్ చిత్రం (Ever Smile New Jersey) 'ఎవర్‌స్మయిల్ న్యూజెర్సీ'లో. దర్శకులు : కార్లో సెరియా (Carlos Seria)

*రాజా రవి వర్మ*

(Raja Ravi Varma)

ఉపనయనమయాక పంచశిఖలతో కనిపించే పిల్లవానిని చూస్తూంటే, రవి వర్మ (1848-1906) చిన్నప్పుడు అలాగే వుండి వుంటాడనిపిస్తుంది. సంస్కృత మళయాళ భాషల అధ్యయనమూ, మన దేవతా మూర్తులను చిత్రించాలనే తపన - ఈ రెండే కనిపిస్తాయి రవివర్మ బాల్యంలో దక్షిణ కేరళలోని కిలమానూర్ గ్రామంలో జన్మించిన రవివర్మ తన చిత్ర లేఖనం ద్వారా హైందవ సంస్కృతికి నవ జీవమిచ్చాడు. పౌరాణిక గాథలు, ప్రసిద్ధ కావ్యాల ప్రధాన సన్నివేశాలు. భారత భాగవత రామాయణాలు - ఒకటేమిటి, కృష్ణుడెలా వుంటాడు, రాముడెలా వుంటాడు, శకుంతల ఎలా ఉంటుంది, సీత ఎలా వుంటుంది - అనే ప్రశ్నలకు మన మనసున నిలి

చేది రవివర్మ బొమ్మే! మన పురాణ వ్యక్తులందరూ రవివర్మ ద్వారా తమ రూపం చెప్పుకున్నారనడంలో ఆశ్చ ర్యం లేదు. ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందిన రాజా రవివర్మ చిత్ర చయనికను, మధు అంబట్ కెమెరా మనకి చూపుతుంది.... 28 ని॥.... ఇంగ్లీషు.... దర్శకత్వం: జె. శశికుమార్.

*ఉస్తాద్ అమ్జద్ ఆలీఖాన్*

(Ustad Amjad Ali Khan)

అమ్జద్ ఆలీఖాన్‌కి తన తండ్రే మొదటి గురువు. వంశ పారంపర్య మగువిద్య ఆ కుటుంబానిది. తను తన పెద్దలవద్దనుంచి ఎలా నేర్చుకున్నాడో, అలాగే తన యిద్దరు కొడుకులకి సుశిక్షణతో సంగీత విద్య నేర్పుతాడు. లౌకిక వ్యవహారాలన్నీ విద్యావతి యైన భార్య చూసుకుంటుంది. ఇతని కెంతకీ, తన సంగీత ప్రపంచమూ సోషల్ రౌండ్సూ తప్ప మిగతా ఏ ధ్యాసాలేదు. మొదటిసారి ఫారెన్ వెళ్తున్నప్పుడు ఏదో బెరుకనిపించిందట. ఇప్పుడు అలవాటైపోయింది.... ఉస్తాద్ అమ్జద్ ఆలీఖాన్ హిందూస్థానీ సంగీతజ్ఞులలో ఉన్నతశ్రేణికి చెందిన వారు. గానలహరిలో మునకలు వేయిసుంది ఈ డాక్యుమెంటరీ....



కెనడా చిత్రం 'బ్లిజర్డ్'లో (Blizzard)

63 ని॥ .... దర్శకత్వం: గుల్జార్.... నాన్ ఫీచర్ ఫిలిమ్స్‌లో ఈ మూడూ గాక: రేపంటే ఆలస్యం: ఆలోచనా రూపాలు; గగనేంద్రనాథ్; అస్సామ్ ఆదివాసులు; సత్యజిత్‌రే; శాక్తే యులు - సూఫిజమ్; మిత్రుల జ్ఞాప కార్థం; మిజోరామ్‌కి హామ్లెట్; ప్రయాణం అంతంకానిచోట - మొత్తం పన్నెండు.... భారతీయ చిత్రాలుగాని, అన్యదేశచిత్రాలుగాని ఇంగ్లీషులో కానప్పుడు, ఇంగ్లీషు సబ్‌టైటిల్స్ విధిగా వున్నాయి.

# మిగతావి

## Focus on South Korean Cinema

| | |
|---|---|
| All that Falls has wings | Chang Kil - Su |
| Blazing Run | Myoung - Joong |
| Chil-Soo and Man-Soo | Park Kwang - So |
| Lovers of Wumuk Baemee | Chang Sun - Woo |
| Man with Three Coffins | Lee Chang - Ho |
| The Ma-Nim | Chung Jin - Woo |
| Moul Le Ya Moul Le Ya | Lee Doo - Yong |
| Pee-Mak | Lee Doo - Yong |
| Searching for Our Class | Huang Gyu - Dok |
| Whale Hunter | Bae Chang - Ho |
| Why Had Bodhi Dharma Left for the East ? | Bae Yong - Kyun |

## Im Kwon-Taek : A Retrospective

Come, Come, Come Upward
Gilsodom
Mandala
The Misty Village
Surrogate Woman
Ticket

## The Early David Lean

In Which We Serve
This Happy Breed
Blithe Spirit
Brief Encounter
Great Expectations
Oliver Twist
Passionate Friends
Madeleine

## Robert Altman : A Tribute

A Wedding
A Perfect Couple
Vincent and Theo

## Films in the Mainstream Section

| | | |
|---|---|---|
| Dil | Hindi | Inder Kumar |
| Ghayal | Hindi | Rajkumar Santoshi |
| Ek Apak Sa Ek | Marathi | Sachin |
| Dhadakebaaj | Marathi | Mahesh Kothare |
| Byabadhan | Bengali | Dilip Mukherjee |
| Kari Dive Kinlam | Bengali | Biresh Chatterjee |
| Pudhu Vasantham | Tamil | Vikraman |
| His Highness Abdulla | Malayalam | Sibi Malayil |
| Karthavyam | Telugu | Mohan Gandhi |
| K. Muthina Haare | Kannadam | S. V. Rajendra Singh Babu |

## Films in the Tamil Retrospective Section

| | |
|---|---|
| Avvaiar | S. S. Vasan |
| Chandralekha | S. S. Vasan |
| Mangamma Sabatham | S. S. Vasan |
| Velaikari | A. S. A. Samy |
| Malaikallan | S. M. Sriramulu Naidu |
| Parasakthi | Krishnan - Panju |
| Thillana Mohanambal | A. P. Nagarajan |
| Manonmani | T. R. Sundaram |
| Meera | Ellis R. Duncan |
| Konchum Salangai | M. V. Raman |
| Ezhai Padum Padu | Javar Seetharaman |
| Maya Bazaar | Chakrapani |
| Kannagi | Jupiter Somu |
| Kathalikka Neramillai | C. V. Sridhar |
| Marma Yogi | K. Ramanath |
| Pasa Malar | A. Bhimsingh |
| Iru Kodugal | K. Balachander |
| Karnan | B. R. Panthulu |
| Sampoorna Ramayanam | A. P. Nagarajan |
| Andha Naal | S. Balachander |

యం.యస్.రెడ్డి సమర్పించు

యం.యస్.ఆర్ట్ మూవీస్




యం.శ్యామ్ ప్రసాద్ రెడ్డి

కె.యస్.రవి

జెకోస్లావేకియా కథానిక

# అల్లుడుగారు

జరొస్లావ్ హసెక్ (1883-1923) అనేక కథానికలు గల్పికలు వ్రాశారు. ముఖ్యంగా ఆయన వ్యంగ్య ధోరణిలో వ్రాసిన 'గుడ్ సోల్జర్ షివీక్' అనే నవల అనేక భాషలలోకి అనువాదం పొందింది. నాటకంగా తయారు చేశారు ; ఫిలిమ్ కూడా వచ్చింది.

'లేదయ్యా బాబూ, లాభం లేదు' అన్నాడు వడ్డీ వ్యాపారస్తుడు విలియమ్స్ తన కెదురుగా కుర్చీలో కూర్చున్న యువకుడితో, 'అబ్బాయ్. నే చెప్పేది జాగ్రత్తగా విను, విని కొంత నేర్చుకో, తెలిసిందా. నా కుమార్తెని వివాహమాడుతా నంటున్నావు. అంటే నాకు అల్లుడు కావాలనుకుంటున్నావు. తద్వారా నువ్వు కొంత డబ్బు పుచ్చుకుందా మనుకుంటున్నావు. అంతేనా ? ఒక క్షణం క్రితం 'నువ్వు పేదవాడివా' అని నేనడుగుతే 'నీదగ్గర మొత్తం రెండు వందల డాలర్లున్నాయన్నావు.'

విలియమ్స్ తన కెదురుగా ఉన్న టేబిలుమీద కాళ్లు చాచి, కుర్చీకి చేర బడి, మళ్లీ చెప్పుకుపోయాడు : 'నేనూ ఒకప్పుడు పేదవాడినేనని, నా దగ్గర అప్పుడీ రెండువందల డాలర్లు కూడా లేవనీ నువ్వంటున్నావు. నిజమే, నే కాదనలేదు. కాని నీ వయసులో వున్నప్పుడు నా దగ్గర అంతకంటె ఎక్కువగానే డబ్బు ఉండేది. కారణమేమిటంటావా? నాకు తెలివితేటలున్నాయి - అవి నీకు లేవు. కోపం తెచ్చుకోకు. కుర్చీలో కొంచెం అటూ ఇటూ కదులుతున్నట్టున్నావు. దయచేసి ఉద్రేక పడకు. మాయింట్లో మంచి బలమైన నౌకరున్నాడన్న సంగతి మరచిపోకు. నేను చెప్పేది జాగ్రత్తగా విను, విని కొంత నేర్చుకో. నా పదహారవ ఏట నేను నెబ్రాస్కాలోని మా మేనమామ గారింటికి వెళ్లేను. కొద్దిగా డబ్బు సంపాయిద్దామని నా ప్రయత్నం : నీగ్రోలను కొట్టి చంపడం. నీకు తెలుసుకదూ, లించింగ్ అంటారు. అలాంటి లించింగ్‌కు గురికానున్న ఒక నీగ్రోను తన ఇంటి ఆవరణలోనే కొట్టి చంపడానికి అనుమతించమని, మా మేనమామను బ్రతిమాలేను. ఆయన సరేనన్నాడు. మా మేనమామ

గార్రి ఇంటి ఆవరణలో వాళ్ల నీగ్రోను కొట్టి చంపేరు. అయితే మేము ఆ స్థలం చుట్టూ ఒక దడికట్టి, లోపల జరుగుతున్నది చూడకోరేవారు కొంత రుసుము చెల్లించాలన్నాము. ప్రవేశ రుసుము వసూలు చేసినది నేనే, వాళ్లు నీగ్రోను చెట్టుకు వ్రేలగట్టేరు; యీ లోగా నేను వసూలు చేసిన డబ్బంతా పట్టుకుని ఉడాయించేశాను.

వాళ్లు చావగొట్టిన నీగ్రో నాకు అదృష్టం తెచ్చిపెట్టేడు. ఏలాగయ్యా అంటే, నేనక్కడ సంపాదించిన డబ్బుతో ఉత్తర ప్రాంతంలో ఒక ఎస్టేటు కొన్నాను. ఈ భూమి మీద ఒకచోట త్రవ్వుతుండగా కొంత బంగారం దొరికిందని విదేశాలలో ప్రచారం జరిపించేను. ఆ భూమి మంచి లాభానికి అమ్మేసి, ఆ డబ్బు వేరే పెట్టుబడి పెట్టేను. అయితే నా భూమి కొన్న వాళ్లలో ఒకడు తరువాత ఆశాభంగం పొంది నా మీద పిస్తోలు పేల్చేడనుకో. ఆ దెబ్బకి నా కుడిచేతి ఎముక ఒకటి విరిగిపోయింది కాని వాడీపనిచేసినందుకు నష్టపరిహారంగా నాకు రెండువేల డాలర్లు చెల్లించుకోవలసి వచ్చింది : అదేమంత ముఖ్య విషయం కాదు.

నా చేతి గాయం నయమయిన తరవాత, రెడ్ ఇండియన్లు నివసించే ప్రాంతంలో క్రైస్తవ దేవాలయాలు నిర్మించడానికై ఒక మత సంస్థలో వాటాలు కొన్నాను - దాని క్రింద నా దగ్గరున్న డబ్బంతా అయిపోయింది. మత సంస్థ తరపున మేము గౌరవ యోగ్యతా పత్రాలిచ్చాము, ఒక్కొక్కదానికీ వంద డాలర్లు పుచ్చుకున్నాము. ఒక్క దేవాలయమైనా కట్టలేదు.

మతసంస్థ దివాలాతీయక తప్పింది కాదు. ఎలాగంటే యీ సంస్థలోని నా షేర్లన్నిటినీ ఆవుతోళ్ళ వ్యాపారంలో పెట్టిన వారం రోజులకల్లా మత సంస్థ దివాలా తీసింది. ఆవు చర్మాల ధరలు పెరగడం అప్పుడే మొదలవడం చూసి నేనందులోకి దిగేను.

ఆవు చర్మాలు అరువు బేరంమీద కొని, నగదు బేరానికి అమ్మేను. మంచి లాభమొచ్చింది.

'నేనాడబ్బు తీసుకెళ్లి కెనడాలోని వేరు వేరు బ్యాంకులలో వేసి దివాలా తీశానని ప్రకటించాను. నన్ను ఖైదులో పడేశారు. కోర్టులో విచారణ జరిగినప్పుడు నేను కోపంగా ఆవేశంతో గట్టిగా కేకలేసాను. నాకు మతి భ్రమణం కలిగిందని కోర్టు డాక్టరన్నాడు. కోర్టువారు నన్ను వదిలేశారు. నా దుస్థితికీ కనికరించి కోర్టులో ఉన్నవారంతా చందాలేసి నాకు కొంత డబ్బు యిచ్చారు; కెనడా వెళ్లి అక్కడున్న నా డబ్బు తెచ్చుకునేందుకు ప్రయాణ ఖర్చులకు సరిపోయిందది.

తరవాత బ్రూక్లిన్‌లో మిస్టర్ హామెల్‌స్టన్ అనే పెద్ద వాణిజ్యవేత్తకు మా రైతును లేవదీసుకుపోయాను. మేము సాన్‌ఫ్రాంసిస్కోకు పారిపోయాము. అతను ఆమెను నాకు భార్యగా చేయక తప్పింది కాదు.



బంకిమ్ చంద్ర చటర్జీ నవలలోని కుంద నందిని కపట స్వాముల వారి మాయోపాయంలో పడదు - బంగ్లాదేశ్ చిత్రం 'విషవృక్షం' లో (The Poison Tree). దర్శకులు : ఛాషి నజ్రుల్ ఇస్లామ్. (Chashi Nazrul Islam)

ఎందుకంటే నేను సాన్‌ఫ్రాంసిస్కోలో ఆమెతో కాపరం చేస్తూ, కొన్నాళ్ళయాక, ఫలానావాడి కుమార్తెకు పెళ్ళికాకుండా బిడ్డ పుట్టినట్లు పత్రికలకొక వార్త అందజేస్తానని అతనిని బెదిరించాను.

'చూశావా అబ్బాయ్, అది నా సంగతి. కాని నువ్వు నీ వయస్సులో, నువ్వు తెలివిగలవాడవని యితరులూహించుకోడానికి తగిన పని ఒకటైనా చేయలేదు.

'ఇటీవల సముద్రం మీద బోటు షికారు వెళ్ళినప్పుడు నా కుమార్తె నీటిలో పడితే దాని ప్రాణాలు కాపాడేనంటున్నావు. అది బాగానే ఉందనుకో. కాని దానివల్ల నీకు ప్రత్యక్షంగా కలిగిన లాభమేమిటి చెప్పు? ఒక జత కొత్త జోళ్ళు పూర్తిగా పాడయినాయని నువ్వే అన్నావు. నువ్వు నా కుమార్తెను ప్రేమించావు కాబట్టి నీలాంటి బుద్ధి తక్కువ దద్దమ్మకు నేను మామగారిని కావాలా? మధ్యను నాకెందుకీ శిక్ష ?'

'అదుగో కుర్చీలో మళ్ళీ అటూ యిటూ కదులుతున్నావు, ఉద్రేకపడకు. ప్రశాంతంగా కూర్చుని నేనడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పు.

'నువ్వెప్పుడేనా చట్టాన్ని ఉల్లంఘించావా ?'

'లేదు.'

'నీ దగ్గరేమైనా డబ్బుందా ?'

'లేదు.'

'నువు నా కుమార్తెను పెళ్లాడ దలచుకున్నావా ?'

'అవును.'

'నా కుమార్తె నిన్ను ప్రేమిస్తు న్నదా ?'

'అవును, ప్రేమిస్తూంది.'

'సరే అయితే, ఇక ఆఖరి ప్రశ్న. నీ దగ్గరిప్పుడు ఎంత డబ్బుంది ?'

'నలభైఆరు డాలర్లు.'

'సరే. నీతో నేను మాట్లాడుతూ అరగంటకు పైనయింది. నువ్వు ఆర్థిక వ్యవహారాలలో నన్ను సలహా అడిగావు. నిముషానికొక డాలరు చొప్పున నువ్వు నాకు ముప్పయి డాలర్లు ఇవ్వాలి.'

'కాని.... నిజంగా, - మిస్టర్ విలియమ్స్' అంటూ యువకుడు అడ్డు చెప్పబోయాడు.

'కానీ లేదు, గీనీ లేదు - నిజంగానే' అని చిరునవ్వు నవ్వి, 'మిస్టర్ విలియమ్స్ తన చేతిగడియారం చూసి నువ్వు నాకు 31 డాలర్లు చెల్లించాలి. మరొక నిముషం గడిచింది' అన్నాడు.

యువకుడు భవీన్ ఆశ్చర్యబోయాడు. జేబులోంచి డబ్బు తీసి విలియమ్స్ కివ్వగానే, 'ఇక దయచేసి నా ఇంట్లోంచి వెళ్లు, వెళ్ళకపోతే బయటికి పంపించి వేయవలసి వస్తుంది' అన్నాడు విలియమ్స్ చిరునవ్వుతో.

యువకుడు గుమ్మంవరకూ వెళ్ళి 'మరి మీ అమ్మాయి సంగతి ?' అన్నాడు.



న్యూజిలాండ్ చిత్రం 'రుబి అండ్ రాటా'లో (Ruby and Rata)

'నేను నా కుమార్తెను తెలివి తక్కువవాడికెవ్వడికీ ఇవ్వను. ముందు ఫో, నా ఇంట్లోంచి, లేదా....' అన్నాడు విలియమ్స్.

భవీన్ వెళ్ళిపోయాక విలియమ్స్ 'మంచివాణ్ణే వెతికావే! నిన్ను ప్రేమిస్తున్న ఆ వెధవ ఒట్టి తెలివి తక్కువ దద్దమ్మ. వాడికి తెలివితేటలు ఏ కోశానా లేవు' అన్నాడు తన కుమార్తెతో.

'మాకు పెళ్ళయే ఆశలేదా ?' అని అడిగింది కుమార్తె.

'ఈ పరిస్థితులలో అది అసాధ్యం. అతనేదైనా ఒక తెలివైన పనిచేసి తన అర్హతను నిరూపించుకుంటే తప్ప మీకు పెళ్లి జరగదు' అన్నాడు

తరువాత మిస్టర్ విలియమ్స్ తన మేనమామగారింట్లో నీగ్రోను కొట్టి చంపడం గురించీ, తనకీ భవీన్‌కూ మధ్య జరిగిన సంభాషణ గూర్చీ

కుమార్తెకు చెప్పి, బతకడమెలాగో తెలుసుకోడానికి మంచిపాఠం చెప్పేను అన్నాడు.

ఆ మర్నాడు విలియమ్స్ వ్యాపారం మీద ఇంకొక ఊరు వెళ్లేడు.

వారం రోజుల తరువాత ఆయన ఊరినుండి తిరిగి రాగానే టేబిల్ మీద నున్న ఉత్తరం తీసి చూశాడు.

మహాశయా !

ఒక వారం రోజుల క్రితం ఆర్థిక వ్యవహారాల గూర్చి మీరు నాకిచ్చిన సలహాకు చాల కృతజ్ఞుణ్ని. మీ దృష్టాంతం నాలో ఎంతో ఉత్తేజం కలిగించింది. మీరు ఊళ్ళో లేనప్పుడు మీ ఇన్పెట్టెలోని డబ్బూ బాండ్లూ తీసుకుని, మీ కుమార్తెతో సహా కెనడా వెళ్ళిపోయాను - భవీన్... దాని దిగువ ఇలా వ్రాసి వుంది.

ప్రియమైన నాన్నకు,

మీరు మమ్మల్ని ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాను. అన్నటు ఇంకో సంగతి చెప్పాలి. ఇనపెట్టి తాళం కనిపించ లేదు. అందుకని నైట్రోగ్లిసరిన్‌తో పెట్టె తలుపు పగలగొట్టవలసి వచ్చింది. ఇట్లు

మీ ప్రియకుమార్తె,

—జరొసావ్ హసెక్

'జగతి' సెప్టెంబరు - 1961

చైనీయ కథానిక

# చక్రవర్తి కల

ఈ శతాబ్ది ముప్ఫయిలలో జపాన్‌వారు చైనాపై దురాక్రమణ గావించగా ప్రజలు ప్రాణ భయంతో గ్రామాలకు గ్రామాలు ఖాళీచేసి దక్షిణానికి పోసాగారు. పెరల్‌బక్ 'గుడ్ ఎర్త్' రోజుల సామీప్యంలో.

కొండల దగ్గిర విపరీతమైన వేడి.

పగలంతా నడుస్తూనే వున్నాను. చెమట. అరికాళ్ళ బొబ్బ లెక్కాయి. ఒక చిన్నలోయ దగ్గిరకొచ్చి ఆ దిగువన నడుస్తూ వుండగా 'టుంగ్ టింగ్' సరస్సు కనిపించింది. సూర్యాస్తమయ వేళేమో చల్లని పిల్ల తెమ్మెర వీచింది. ఇక్కడ కాందిశీకులు లేరు; రోడ్ల మీద జనసమ్మర్దం లేదు, జపాను విమానాలు లేవు. యుద్ధం వెనకనెక్కడో జరుగుతోంది. బతికి బయటపడ్డానుకదా అని ఒక్కనిట్టూర్పు విడిచాను. సరస్సుకి అవతల పక్కనించి ఒక అరుపు - ఒకే ఒక్క అరుపు - వినిపించింది. తర్వాత చీమ చిటుకు మన్నా వినిపించేటంతటి నిశ్శబ్దం.

వీపుమీదున్న మాసిన బట్టలమూట కింద పెట్టి, దాన్ని ఒక తలగడగా, చేసుకు ఆ పచ్చగడ్డిమీద వెల్లకిలా పడుకున్నాను. పైన ఆకాశం, కింద నీరూ ఒకే నీలంలో ఉన్నాయి; కాని ఆకాశం నెమ్మది నెమ్మదిగా సిగ్గుపడి కందగడ్డలా ఎర్రనయింది. కొంగల గుంపొకటి రోదిస్తూ తన నిజనివాసానికి పోగా సూర్యుడు అస్తమించాడు.

కాసేపు ఏశబ్దమూ లేదు. దారిలో ఎన్నోసార్లు వినపడ్డ మిడతల చప్పుడుకూడా లేదిక్కడ. అలల తాకిడ వినీ వినిపించనట్లు చెవులకి సోకుతుంది. ఒక్కసారి పెద్దగా గాలి వీయడంతో శబ్దం ఏదో గంట మోగినట్లు, ఆ శబ్దం ఏ వాద్యానిదో నాకు తెలుసు. ఆ పాట – మధ్యచైనాలోని విశాలమైన పచ్చికబయళ్ళలో వయసొచ్చిన పిల్లలు ఖులాసాగా పాడుకునే కమ్మటిపాట. నేను ఆలమండల కాపరిగా వున్నప్పుడు ఆ పాట వింటూంటే దిగులేసేది :

'నన్ను నీతో కూడా ఆకాశపు
కొసకిరానియ్
నన్ను నీతో కూడా సముద్రపు
టంచుకిరానియ్
సముద్రపు యిగిరిపోవచ్చు
శిలలు అరిగిపోవచ్చు

కాని నా మనసు మారదు. తెలిసిందా-

నా మనస్సు మారదు

అలాంటి పాట ఈ నిర్జన ప్రదేశంలో విని ఆశ్చర్యపోయాను. ఇలాటి సామాన్యమైన పాట పాడుకునే మనుషులు ఈ చుట్టుపట్ల వుండటం యింకా తమాషాగా తోచింది. మనుషులు ? మనుషులమాట తలపుకి రాగానే ఆకలి గుర్తొచ్చింది. తలుచుకున్న కొద్దీ ఆకలి బాధ ఎక్కువైంది. రోజల్లా ఏమీ తినలేదు. ఆ సంగతి గుర్తురాగానే ఎన్నో వారాలబట్టి పస్తులున్నట్టనిపించింది. ఆకాశం నల్లబడటం వెర్రివాలకంతో చూస్తూ, ఈ పసరిక మీద పరమ మూర్ఖుడిలా ఎలా పడుకుంటాను ? భటాలున నుంచున్నాను ; పాట వినబడ్డ వైపుగా నడక సాగించాను.

సరస్సుకి కుడివైపున చెట్లచాటున ఒక పల్లె ఉంది. కండపుష్టిగల వ్యవసాయకూలీలూ, పీలికలు ధరించిన కుర్రాళ్ళూ, పొడుగాటి చుట్ట కాల్చే పెద్దలూ వున్నగుంపు - నాలుగుపక్కలకీ చెదురుతోంది. కొందరి మొహాల్లో విచారం, మరికొందరు వెర్రి ఆసక్తితో చూస్తున్నారు - నల్లటి ప్రపంచంలో కూరుకుపోతున్న ఆ డాన్సర్లవంక. పాట వింటున్న ఆడపిల్లల్లో కొందరి కళ్ళు చెమర్చాయి. వారి మెత్తటి ఆత్మల్ని డాన్సర్ల పాట కదిలించి వుంటుంది. నాకు తెలుసు, అది శోకగేయమని ; ఆగేయం వెనకాల దాగున్నది ట్రాజెడీ. వీపుమీద మూటవేళ్ళాడేసుకుని, కాళ్ళీడ్చుకుంటూ నేను వారిదగ్గిర కొచ్చేసరికి ఆ గుంపులో ఒక్కరు లేదు. అందరూ యిళ్ళకి భోజనాలకి పోయారు. అదృష్టవంతులు - యుద్ధం గురించి తెలీదు వారికి, పాపం వారి అమాయకత్వానికి దిగులేసింది.

ఒక ముసిలివాడు యిద్దరు నాట్యకత్తెలూ వున్న ఆ బృందం ఎదురుగ్గా నేను నుంచున్నాను. అమ్మాయిల్లో ఒకతె కాస్త లావుగా నాజుగ్గా గాలిలో ఆడే లిల్లీలా ఉంది. రెండో అమ్మాయి సన్నగా పూలరెమ్మలా వుండి శూన్యంలోకి ఏదో వేదనతో చూస్తోంది. ఒకరితో ఒకరం మాట్లాడుకోకుండా, క్రమ క్రమంగా చీకటి మా పరిసరాన్నీ, ఆ పల్లెనీ, మా చుట్టూ వున్న సమస్తాన్నీ ఎలా మింగుతున్నదీ చూస్తూ నిస్తేజులమై నుంచున్నాం.

"మాకు మల్లేనే యిల్లూ వాకిలీ లేని దిమ్మరివా ?" అన్నాడు వృద్ధుడు నిశ్శబ్దాన్ని నిలుస్తూ.

"అవును. జపాన్ ఆక్రమణ నించి పారిపోయి వచ్చాను, మూడు రోజుల క్రితం మధ్యచైనా రాజధాని వుంభాగ్ని పట్టుకున్నారు."

"బావుంది-ఈ దుర్దశలో కామ్రేడ్స్ మనం రాత్రి మకాంకి చోటు వెతుక్కుందాం - పద."

అతను ముందు నడిచాడు. మంత్రముగ్ధుడిలా వెనక నేను. నా వెనక ఆ యిద్దరమ్మాయిలు, నేను వేసే ప్రతి అడుగూ వారు వెనక నించి పరిశీలిస్తు

న్నారనే ధ్యాసలో కాస్త యిబ్బంది పడ్డాను. వృద్ధుడు మాటలు మొదలెట్టాడు. ముందుపళ్ళు వూడిపోయాయి కనక అతని మాటలు స్పష్టంగా వినిపించేవి కావు.

"కొత్తబ్బాయ్, నేను పాటగాణ్ణి - తెలుసా ?"

"అలాగా !" అన్నాను - అతని మెళ్ళో వేలాడుతున్నాయి "డోలూ కర్రలూ"

"నేను డోలు కొడతాను. కనిపించడం లేదూ ?" అన్నాడు ఒకసారి తల పంకించి, నన్ను నమ్మించేందుకా అన్నట్లు "నేను ఈ ట్రూపుకి మేనేజర్ని" అన్నాడు.

"ఏ ట్రూపు?" అన్నాను అర్థంకాక.

"మా కంపెనీ. వెనక యిద్దరు పిల్లలు కనిపించడం లేదూ ? వాళ్ళు నా కూతుళ్ళే కావచ్చు. కాని ఒకటోరకమైన నాట్యకత్తెలు. ఒకటోరకం అంటే నమ్ము."

అలా కబుర్లు చెప్పుకుంటూ కొండ దిగువని వున్న శిధిలాలయం దగ్గరికి వచ్చాము "అబ్బాయ్ - మనం వుండవల్సిన చోటు యిది," అన్నాడు తాత. మేము లోనికి నడిచాం. నిప్పుపుల్లగీసి ఆముదపుదీపం వెలిగించాను. ఆ దీపం వెలుతురికి కూడా అక్కడి ఎలుకలు బెదరలేదు. వీపుమీద వున్న బట్టల మూట వూగిసలాడిస్తూ, ఏంచేయాలో తోచక నిలబడ్డాను ఆ ఆముదపు దీపం ముందు.

"ఇది నా పెద్దకూతురు - వెలెట్," అన్నాడు తాత బొద్దుగావున్న పిల్లని చూపిస్తూ, "అది వాసంతి - చిన్న కూతురు" తర్వాత పక్కనున్న గడ్డిమేటిమీద కూలబడి, కాళ్ళూ చేతులూ బారజాచుకు పడుకొని 'అమ్మయ్య ! ఈరోజు గడిచింది' అంటూ నిటూర్చాడు

డాన్సర్లకి నన్ను పరిచయం వేస్తున్నప్పుడు వారి వంక స్నేహపూర్వకంగా చూశాను. వారూ అలాటి ఆర్ధ్రత తోటె నన్ను వీక్షించారు. వారి చిరునవ్వులో వెచ్చదనం ఉంది. నావంక చూసినప్పుడు స్నేహానికి స్వాగతమిస్తూ వారి నేత్రాలు ప్రకాశించాయి. తక్షణం ఒక ఆలోచనతట్టి తాతని అడిగాను. "బాబా - నన్ను నీకంపెనీలో చేర్చుకోకూడదు?"

"ఆ.... నువ్వు ఏదో చదువుకున్నవానిలా అగుపిస్తున్నావు - పండిత లోకానికి చెందినవాడివి !" తాత నా మొహంలోకి ఆశ్చర్యంతో చూశాడు. "నిజం చెప్పాలంటే మాది మొరటు బతుకు."

"ఫర్వాలేదు. రెండుతీగెల ఎర్హూ నేను వాయించగలను, నేనుకూడా నీకు సాయపడతాను ; నువ్వు మంచి పాటగాడివే అనుకో." వాక్యంలో రెండో భాగం మనస్ఫూర్తిగా అన్నది కాదు - కాని అనేశాను. అనుకోకుండానే అలా వచ్చేసింది. తాత నా పొగడ్తకి సంతోషించాడు. "సరే - నీకు వుండాలని వుంటే మాతో వుండు - మానవులందరూ సోదరులే కదా !"

ఎంత హాయి ! ఆ అమ్మాయిల గురించిన బెరుకు ఒక్క తృటిలో

పోయింది. హాయ్యి అంటించి వంట జెయ్యడంలో వారికి సాయపడ్డాను. ఎంతో మాట్లాడాము - మాపని గురించి, మేము పుట్టిన స్థలాలగురించి. వాళ్ళది మంఛురియా. తాతముత్తాతల కాలంలో మధ్యచైనాకి వలస వచ్చారు. అందుకనే ఆ దేశీయపదం - నేను దూరంనించి విన్నపాట - అంత చక్కగా పాడగలిగారు. స్త్రీత్వంతో అతి మార్దవంగా వుండే వైలెట్ శ్రావ్యకంఠాన్ని ప్రేమించాను. చీకటి గోళాల్లా వుండే వాసంతి పెద్ద పెద్ద కళ్ళు నన్ను ప్రేమతో కట్టేశాయి.

భోజనాంతరం తాత గడ్డివాము మీద మేనువాల్చి, 'గుడ్ నైట్' చెప్పకుండానే కళ్ళుమూసుకున్నాడు. కాని, అతని నాలిక యింకా పెదిమల్ని వుట్టినే తడుపుతోంది. వింతగా చూశాను. నిద్దర్లో మనుషులలా ప్రవర్తించడం నాకు తెలీదు.

"అలా చూడకు" అంది వైలెట్, తన స్త్రీ సహజమైన మృదుకంఠంతో, "చంద్రుణ్ణి చూడు - ఎంత బావున్నాడో!"

తల పైకెత్తి మేఘాల్లేని ఆకాశం లోని చంద్రబింబం చూశాను. నాలుగు వైపులా కాంతి వెదజల్లుతున్నాడు చంద్రుడు. మధ్యనైనాలో జపాను వాళ్ళు కాలుపెట్టినప్పట్నుంచీ వెన్నెల సంగతే మర్చిపోయాను.

"ఎంత బావుంది - వెన్నెల దేవత ...." నేను బిగ్గరగా మాట్లాడుతు న్నట్టున్నాను - గొంతు తగ్గించమని వారించింది వాసంతి.

"ఉష్, ఆ చెట్టువంక చూడు" అంది వాసంతి ఆ ఆవరణలో వున్న ఒక వృక్షాన్ని చూపిస్తూ.

ముసిలిచెట్టు, తొర్రలతో వూడ లతో భయం గొలుపుతూ వుంది. ఎన్నివందల ఏళ్ల వయస్సో ఆ చెట్టుది. ఆ చెట్టు ఆకులు గుడిమీద వాలి వుండటంచేత, గోపురానికి ఈకలు మొలిచినట్టు ఉంది. పైనున్న కొమ్మ ల్లోంచి పక్షుల రెక్కల చప్పుడు విని పిస్తోంది. "పాపం - నిద్రపోతున్న పిట్టలు నా కంఠం విని జడుసుకుని ఉంటాయి" అనుకున్నాను నాలో నేను.

వాసంతి తొట్రుపాటులేని కంఠం తో అంది. "నాకో సామెత జ్ఞాపక మొస్తోంది. నిద్రపోతున్న పక్షి మూడు సార్లు రెక్కలు రెపరెప లాడించటం వింటే, మనకో మంచి కల వస్తుంది — ఆ కల నిజమవుతుంది."

ఆసక్తిపుట్టి అడిగాను. "అయితే నువ్వెన్నిసార్లు విన్నావ్?"

"సరిగ్గా మూడుసార్లు."

"ఇంకేం - నీకో మాంఛి కల వస్తుంది."

పెదవి విరుస్తూ, "ఏమో మనకి న్నేళ్ళబట్టీ వస్తున్నవి పీడకలలే!" అంది వాసంతి.

"ఒక్క మంచి కలకూడా రాలేదా-ఎంచేత ?"

ఆమె కలల గురించి నాకెందుకు ? అంత ఆదుర్దాపడవల్సిన అగత్య మేమిటి ?

వాసంతి జవాబు చెప్పలేదు. జుట్టుకి మల్లే నల్లగావుండి పిల్లికళ్ళలా మెరిసే ఆమె నేత్రద్వయం నన్ను నిశి తంగా చూసింది. ఎందుకో వ్యాకుల పడుతోంది. ఆమె వ్యాకులత నన్ను కూడా కలవరబెట్టింది. ఆ తీక్షణమైన చూపులకి నాకు మతిపోయినట్లయింది. తెలివిగల వైలెట్ యిలా సర్ది చెప్పింది.

"మా జీవితాలకి స్తిమితంలేదు. నాలుగేళ్ళ క్రితం జపాను వాళ్ళు మా గ్రామం తగలబెట్టినప్పట్నుంచీ మాకు శాంతి లేదు. మా వెనకనే శత్రువు వస్తూంటాడు."

తనకంతవరకూ స్ఫురించని ఏదో కొత్తభావంలా, "నిజమే - మాకు శాంతిలేదు. జపానువాళ్ళ మాట గడి చిన మూడు రోజుల్నుంచీ వినడంలేదు - అంతే!" అంది వాసంతి.

నా అనుమానాలు నాకున్నాయి. 'ఇంకో రెండురోజులు పోతే మీకే తెలుస్తుంది!' అనుకున్నా మనసులో, వారి 'మూడ్' పాడు చెయ్యడం యిష్టంలేదు. అంచేత అన్నాను: "అయితే నీకు మంచి కలలొసాయి.

నీకు ఎలాటి కలలు కావాలి? నువ్వు ముట్టుకున్న ప్రతిదీ బంగారమయే మంత్రదండమా? నిన్ను ఆనంద లోకానికి తీసుకువెళ్ళగలిగే రెక్కలా? - ఏం కావాలి?''

''దేశదిమ్మరి కూతుళ్ళం - మాకంత పెద్ద ఆశలు లేవు'' అంది వాసంతి, వేడిఊపిరి వదుల్తూ, ''నాకు చదువుకోవాలని ఉంది. రాయడం, చదవడం నేర్చుకోవాలి. నీకు వచ్చిన పాటలు నువ్వు రాయగలిగితే - నువ్వు చదవగలిగితే! అంత కంటె యింకేం కావాలి? అమ్మ పాటలు నేర్పేటప్పుడు ఆ అదృష్టం కోసం ఎంత తపన పడ్డానో! అమ్మ మంచి డాన్సరు - నాన్నకంటె బాగా సంపాయించేది.'' చటుక్కున ఆపేసి, స్వప్నజగత్తుకీ వాస్తవ ప్రపంచానికి మధ్యనున్న వాసంతి నావంక వెర్రిగా చూస్తోంది.

వైలెట్ కాస్త తేరుకుంది గాని మళ్ళీ విచారసాగరంలో పడి ఏదో కనిపించని గాయంవల్ల నిట్టూర్చింది. ''నేను కూడా స్టూడెంటుని కాగలిగితే....''

''స్టూడెంటా!'' - నిద్దరనించి మేల్కొన్నట్టు అందుకుంది వాసంతి. ''మొన్న డాన్సు చేస్తూవుండగా చూసిన ఆ ఖామాందు పేరేమిటి? తర్వాత నిన్ను నాన్న దగ్గిర మెచ్చుకున్నాట్ట. అతనికి పిల్లలు లేరు - పెళ్ళాం చచ్చిపోయింది; కనుక నిన్ను కూతురులా పెంచుకుని బడికి పంపుతానన్నాడు. నువ్వే వొద్దన్నావు. నాన్నతో ఈ మొరటుబతుకే

బావుంది కాబోలు, ఎందుకు అబద్ధాలు చెబుతావ్ ?''

వైలెట్ తికమకపడింది. చెల్లెల్ని ఎలా ఎదుర్కోవాలో తోచలేదు. "వాడిది కపటనాటకం, వాడి ఉద్దేశం అది కాదు....''

"రక్షించండి, రక్షించండి. నా పెళ్ళాన్ని వొదలండి.''- మా సంభాషణ లో ఈ ఆర్తనాదం పిడుగులా పడింది. గడ్డివాము పక్క పడుకుని గురక పెడుతున్న తాతదీ ఆక్రందన. అలాటి చోట్ల పాము లెక్కువగా వుంటాయి కనుక, ఏదైనా పాము అతని మెడ మీద కాటేస్తోందోమోననుకుని, కర్ర కోసం వెతకబోయాను. వైలెట్ ఆగ మంది.

"అదేంలేదు. ఆయనకేదో పీడకల వచ్చి వుంటుంది. జపాను వాళ్ళు మా గ్రామం మీద పడి, అమ్మనెత్తుకు పోయినప్పట్నుంచీ ఆయనకి నిద్దర్లో ఆ కేకలు మామూలే ! అమ్మ ఏమ యిందో మాకు తెలీదు. చచ్చిపోయి వుంటుంది....''

అర్థమవుతోంది నాకు. మరొక కన్నీటి కాలవ. వివరాలు అడిగి వారి మనసు బాధపెట్టడమెందుకు ? యుద్ధ కాలంలో మానవ హృదయం ఎంత మెత్తగా ఉంటుందో ! "మనకి నిద్దర వేళ అయింది. రేపు మీరు యిం కొంచెం శ్రమపడాలి - మరోకడుపు నింపానిగనక,'' అన్నాను నెమ్మదిగా. గుడ్‌నైట్ చెప్పటానికి ముందు వారి లేత హృదయాల్లో చిన్న ఆశ మొల కెత్తించాలని అన్నాను. "మనకు శత్రు భయం పోయి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, స్కూళ్ళలో విద్య ఉచితంగా నేర్పుతారు. అప్పుడు అందరికీ పాటలు రాయడం చదవడం చేతనవుతుంది.'' ఆ పైన నిద్రపోయాను.

మర్నాడు పక్కగ్రామానికి వెళ్లాం. నేను ఎర్హు - అనగా రెండు తీగెల ఫిడేలు - వాయించాను; తాత డోలు మోగించాడు. నేను బాగానే వాయించి వుండాలి. వాసంతి పాటకి, వైలెట్ అడుగులేసి నృత్యం చేస్తోంది. తేలిగ్గా సులువుగా మత్స్యకన్యలా డాన్సు చేసింది వైలెట్. నర్తన, సుశ్రావ్యమైన పాట యువకుల్ని ఆకర్షించింది, అప్పు డప్పుడు తన ఎర్రటి పెదవులతో చూపే ఆ కృత్రిమనవ్వులో అక్షరాలా విషాదమే ! కొందరు గ్రామవాసులు మెచ్చుకున్నారు. అయితే, ఎక్కువ మంది రాలేదు.

ప్రేక్షకులు లేని ఆ కూడలిలో నే నేదో వైణికుడిలా వాయించడం, తనేదో నర్తకిలా అమె గెంతడం, ఒక్కడూ మా వంక కన్నెత్తి చూడకపోవడం నాకు వెగటుగా తోచింది. దీనాతిదీన మైన అవస్థమాది. తాత తనడోలు పిచ్చివాడిలా డబడబా మోగించి అఖ రికి విసుగెత్తి ఆ పుడకలు రెండూ విసిరేసి, ఒక బండరాతి మీద కూచుని, అలిసిన కంఠంతో వైలెట్‌ని ఉద్దేశించి అన్నాడు : "అమ్మాయ్ - కాసేపు విశ్రాంతి తీసుకో,'' పెదిమిల మీద భావరహితమైన నవ్వు ధరించి, నాట్యకత్తె తండ్రి పక్కనే కూచుంది. ఎవరు పోగొట్టగలరు అమె దిగులుని ?

ఒక నిముషం గడిచాక వాద్యాలు మూట గట్టుకు, యింకో గ్రామానికి వెళ్ళాం. మిట్టమధ్యాహ్నం, వీపు మీద మూటవేసుకు, తట్టల్లో పిల్లల్ని పెట్టుకు, వేలాడే మొహాలతో రోడ్డు నిండా జనప్రవాహాలు. మనుషుల వెనక కుక్కలు పొడుగాటి నాలుకలు బాచుకు నడుస్తున్నాయి. ఆ మనుషుల నుదురు మాడుస్తున్నాడు దినకరుడు చెంపల మీద చెమటబొట్లు అలా కారుతూవున్నాయి. ఏం జరుగుతోందో నాకు తెలుసు. సంశయ నివారణకోసం ఒక రైతుని ఆపి, సంగతేమిటో అడి గాను.

"శత్రువు తరుముకొస్తున్నాడు. ఇవ్వాళ ఉదయం ఒక గండభేరుండ పక్షి, మా గ్రామంమీద గుడ్లు విసిరి యిరవై అయిదు ప్రాణాలు పొట్టనెట్టు కుంది - ఆరుగురు పిల్లలూ మూడు ఆవులూ కలుపుకు యిరవై అయిదు ప్రాణాలు."

"ఏం ప్రపంచంరా నాయనా" అంటూ పెద్దగా శ్వాస వొదిలాడు తాత. "ఈ ఉపద్రవాల్నించి నేను నాలుగేళ్ళ బట్టీ పరిగెడుతున్నాను. కాని, ఎక్కడా శాంతిలేదు," అమ్మాయిల వైపు తిరిగి అన్నాడు." నేనేం చెయ్య గలను మీకు ? నా ఎముకలు హూనం అవుతున్నాయి ; మీరు ఎదుక్కొస్తు న్నారు...."

పిల్లలు జవాబు చెప్పలేదు. ఇద్దరూ తలలు వాల్చుకున్నారు. మేము ముం దుకి సాగాం, మరోగ్రామం దగ్గిరకి వచ్చాం. ఊరంతా ఖాళీ, ఇంకోగ్రామం దగ్గిరికి వెళ్ళాం. అదీ అంతే, నిర్మాను ష్యం, మాకు తిండిలేదు. సంపాయించు కోలేక పోయాం ; అలిసిపోయాం ; కాళ్ళు తడబడుతున్నాయి.

"నిన్నటి దేవళం దగ్గిరికి పోదాం పదండి. నాకాళ్ళు తేలిపోతున్నాయి - యిలా తప్పించుకుని ఎక్కడికి పోతాం ?'' అన్నాడు తాత.

శిథిలాలయం సమీపించే వేళకి మేము కాళ్ళమీద నుంచోలేకపోయాం. ఇద్దరమ్మాయిలూ గడివాముమీద చతికిలబడ్డారు. నేను గోడని ఆసరా చేసుకు కూలబడ్డాను. తాత మాకెదురు గా కూచున్నాడు. నాలికలు పిడచ కట్టుకుపోయాయి - నోట మాటరాదు. ఆ అమ్మాయిల అమాయకపు నేత్రాల్లో మాటలక్కర్లేని నిస్సహాయ సందేశ మేదో ఉంది. వెర్రిగా బట్టతల గోక్కొంటున్న తాతమీద వుంది వారి దృష్టి. చివరికి తాత నిలబడి అన్నాడు.

"మనకి తినేందుకు ఏదో ఒకటి ఉండాలిగా ! ఆఖామందు దగ్గిర్నుంచి కాసిని బియ్యం బదులు తీసుకొస్తాను.'' వైలెట్ మొహాన్ని వోసారిచూశాడు. "అతనంత దుర్మార్గుడిలా లేడు. నిన్ను పెంచుకుంటానంటే పెంచు కుంటాడు - అంతే'' వూగుకుంటూ అతను వెళ్ళిపోయినాడు. చాలా అలిసి వున్నాడు - పెద్దవాడు - ఈ పనికి తగడు. కాని, యింకెవరు చెయ్య గలరు ? మొదటిసారి బోధపడింది మా అసహాయత.

రెండు గంటల తర్వాత ఒక చిన్న బియ్యపు సంచి చేతిలో పుచ్చుకొని వచ్చాడు తాత. అందరి మొహాలూ

వికసించాయి. నేను అతను దగ్గిరికి ఛెంగునవెళ్ళి సంచి పుచ్చుకున్నాను. అది మాకు బంగారుమూటలా ఉంది. వాసంతి అతన్ని గడిమీద కూచో బెట్టింది; వైలెట్ అతనికి ఉపచారాలు చేసింది. మురికిగుంట మీద నుంచి లేచే మేఘంలా ఉంది. ఆ విసురు తున్నప్పుడు వచ్చే ఆవిరి. తాత చికాకుగా ఉన్నాడు, విసుగుపడుతూ అన్నాడు.

"కూచోండి, అమ్మాయిలూ" మళ్ళీ ఒక నిట్టూర్పు విడిచి వైలెట్‌తో అన్నాడు. "నేనో ఏర్పాటు చేశాను, పెద్దమ్మాయ్. అంత అధ్వాన్నమయింది కాదనుకో, తొందరపడ్డానేమో!"

"ఏమిటి బాబా?" వైలెట్ కళ్ళు బెరుగ్గా చూశాయి.

"బియ్యం యిచ్చిన ఖామందు నాతో మాట్లాడాడు - నీకు తెలుసుగా? నువ్వంటే అతనికి బాలా యిష్టం. ఇప్పుడు స్కూళ్ళులేవు కనక నిన్ను పెంచుకోడం పడదన్నాడు. పెళ్ళి జేసుకుని సుఖపెడతానన్నాడు."

"మాట యిచ్చావా?" అంది వైలెట్. కళ్ళలోని భీతే గొంతుకలో కూడా.

"ఇవ్వక?"

"బాబా, నేను నీదగ్గిరే ఉంటాను."

"ఛెట్" అన్నాడు తండ్రి కటువుగా – కూతుర్ని మందలిస్తూ, కాసేపటికి అతను మెత్తబడి మామూలులోకి వచ్చాడు. "అతను వయసులో పెద్దవాడు – నాకు తెలీదు గనకనా? నీకు తగడు. కాని నాతో యిలా అడుక్కు అడుక్కు తింటూ బతుకుతావా? ఈ అవకాశం జారిపోతుంది - యవ్వనం గడిచిపోతుంది. నేను పెద్దవాణ్ణయిపోతున్నాను. నేను బతికుండగా మన పరిస్థితులు బాగుపడవు. అతనికి డబ్బు వుంది. నీకే బాధలూ వుండవు. నీ కొడుకులూ కూతుళ్ళూ బళ్ళోకెళ్ళి చదువుకుని విద్యావంతులవుతారు. నేను నీకు ఏంచేశాను? దేశదిమ్మరి కూతురిలా పెంచాను...."

నెమ్మది నెమ్మదిగా అతని కంఠం పల్చబడి నిశ్శబ్దంలో కరిగిపోయింది.

వైలెట్ బొమ్మలా తల వాలేసింది. గాలి కీచుమంటూ సన్నగా రోదించింది దూరాన ఏదో టకటక శబ్దం. తాత తల పైకెత్తి రుద్ధకంఠంతో అన్నాడు, "ఖామందు నీకోసం పంపుతున్నాడు శత్రువు మీది మీదికి వస్తున్నాడమ్మాయి. ఒక్కక్షణం వృథా చేయ్యడానికి వీలులేదు. ఖామందు గలభా లేని జిల్లాకిపోయే ఏర్పాట్లు చేసుకుంటున్నాడు. మంచి పిల్లలా ప్రయాణానికి సిద్ధంకా."

మేనాలాంటి ఎర్రకుర్చీ వొచ్చింది; దానికి అలంకారాలు కూడా ఉన్నాయి. కాని అది వివాహపల్లకి కాదు. రెండో పెళ్ళాంకోసం వివాహపల్లకీ పంపి ఆచారంలేదు. ఒక రౌడీ యువకుడూ, యిద్దరు బోయీలు వొచ్చారు. ఆ యువకుడు ఖామందు దగ్గిర పనిమనిషి. బోయీలు కండలు దేరి బలిష్ఠంగా ఉన్నారు. వాళ్ళ

ఆకారాలూ, పద్ధతి చూస్తే ఎవరినో ఎత్తుకు పోడానికి వచ్చినట్టున్నారు.

త్రాత కాలు కదపలేదు. ఆ వచ్చిన యువకుణ్ణి మర్యాద చెయ్యలేదు. నిర్భాగ్య చక్రవర్తిలా నోట మాట లేకుండా కూచుని, అమాంతం ఏదో గుబులు పుట్టుకొచ్చినట్లు : "నువ్వు నిజంగా మంచి పిల్లవైతే, వైలెట్, నేను చెప్పింది విను. ఆ మేనా ఎక్కు. నేను నీ తండ్రిని. ఈ ప్రపంచంలోకి నువ్వు రావడం పెరగడం చూశాను. నీ సుఖసంపదలే నా లక్ష్యం.... సుపుత్రాభి సిద్ధిరస్తు"

వైలెట్ ఒక్కమాట చెప్పలేదు. మంత్రానికి కట్టుబడ్డట్టు ఆ కుర్చీలోకి వెళ్ళి కూచుంది. యువకుడు మేనా తలుపు మూశాడు. ఇద్దరు బోయీలు బుజాలకెత్తుకున్నారు మేనాని - లోపల వున్నది ఏదో సర్వసామాన్యమైన బరువులా, చీకటి పడబోతోంది. పశ్చిమాకాశంలో ఇంద్రధనుస్సొకటి మెరిసింది, ఎక్కడో తుపానుకాబోలు! గాలి చల్లగా ఉంది. చెట్లఆకుల గలగలలో సగం పాటా, సగం వేదనా స్వరమూ.

ఒక పెద్దకేక వినిపించింది. తల్లి లేనిపిల్ల కెవ్వుమని వేసేకేక అది. అది వైలెట్ కేక; ఆ కేక మళ్ళీ వాతావరణంలో కలిసిపోయింది. అంతా నిశ్శబ్దం, ఇంద్రధనుస్సు సగం, మూసుకొస్తున్న చీకటి - యివే మిగిలాయి.

ఇనుమెంతబరువో నాగుండె అంత బరువై పోయింది ఏడ్చాను నాలోనేను 'ఇది నా తాతముత్తాతలగడ్డ - యిది మా జీవితం - ' అని, నే నెక్కడికీ తప్పించుకు పారిపోలేననే జ్ఞానోదయం కలిగింది నాదేశంనించి నేను ఎక్కడికి పారిపోతాను ? ఇది నాదేశం, నేను ఈ గడ్డమీద పుట్టాను. ఇక్కడే బతకవలసినవాణ్ణి. కళ్ళుమూసుకు ఏదో ధ్యానంలో వున్న తాతదగ్గిరికి స్థిరనిశ్చయంతో వెళ్ళాను.

"నీ నిద్ర పాడుచేసినందుకు నన్ను క్షమించు, తాతా. గెరిల్లాల్లోజేరి శత్రువుని ఎదుర్కుంటాను. మిమ్మల్ని వొదిలి వెళ్ళవల్సి వచ్చినందుకు విచారిస్తున్నాను" అన్నాను.

కళ్ళుతెరిసి నావంక మందకొడిగా చూసి, బలహీనంగా అన్నాడు. "సరి, నీయిష్టం. పొద్దుట్నుంచీ తిండి లేదు. ఈరాత్రి కిక్కడ భోంచేసి రేపు పొద్దున్నపో."

మనసులో ఏలాగో ఉంది. ఏమీ తోచక గడ్డివాము పక్క కూచున్న వాసంతివైపు తిరిగాను. తనసోదరికోసం లోపల్లోపల ఏడుస్తూ వుంటుందనుకున్నాను - కాని అలా ఏడవక పోవడం నన్ను చకితుణ్ణి చేసింది. ఇంద్రధనుస్సులోని ఆఖరు ముక్క చూస్తూ ఆకుల గలగల వింటూ తనలో తను చెప్పుకుంటోంది. "నిన్న రాత్రి నాకు కల రావల్సింది - రానేలేదు. నిద్రపోతున్న పక్షి రెక్కల చప్పుడు మూడుసార్లూ స్పష్టంగా విన్నాను...."

"అది వొట్టి మూఢనమ్మకం" అన్నాను. ఆమె ఉలిక్కిపడింది.

"కాదు, అమ్మ నమ్మేది. మాట వరసకి అడుగుతున్నాను - నువ్వు స్టూడెంటువా?"

"ఒకప్పుడు" అని వొప్పేసు కున్నాను.

"అయితే - నాకు అక్షరాలు రాయడం నేర్పు" అంది దీనవదనంతో బతిమాలుతూ, నా చెయ్యి పట్టుకు కిందికి లాగి పక్కన కూచో బెట్టుకుంది.

కర్రముక్కతో యిసుకలో అక్షరాలు రాశాను. మొట్టమొదట 'ఇంద్రధనుస్సు' (హంగ్) రాశాను. "దీనిలో రెండు భాగాలున్నాయి. ఎడమ వైపుది పురుగు – పట్టుపురుగు లాంటిది; కుడివైపుది కళ. ఇంద్రధనుస్సు అనగా కళాత్మకమైన పట్టు పురుగులాంటిది" అని విపులపరిచి చెప్పాను.

"అవన్నీ నేను చదవగలిగితే.... అమ్మదగ్గిర్నుంచి నేను నేర్చుకున్న పాటలన్నీ చదవగలిగితే...."

తెల్లారిన తర్వాత మొదట లేచింది నేనే. వెళ్ళబోయే ముందు మా కంపెనీ యజమానికి గుడ్‌బై చెబుదామనుకున్నాను. తాత నిద్రపోతున్నట్లు నటించాడు చెప్పకోలేని విచారంతో అవని కనురెప్పలు కదలడం గమనించాను; నేనూ పెదవి మెదపలేదు. వాసంతి వొట్టి రాయిలా ఉంది. వీడ్కోలు లేకుండానే పోయే ప్రయత్నంలో ఉన్నాను. నేను - వెళ్ళబోతూ వుండగా చటుక్కున కళ్ళు తెరిచింది.

"అయితే వెళ్ళిపోతున్నావా? ఇదొక్కటీ వినవూ? నాకు రాత్రి మంచి కలొచ్చింది."

"మంచికలా?" అన్నాను బరువుగా.

"అవును. మంచిదే!" - విచారంగా వున్న అధరం మీదకి నవ్వు తెప్పించుకుంది. "వైలెట్ వయసులోవున్న ఒక స్టూడెంటుని పెళ్ళి జేసుకున్నట్టు కలవచ్చింది. అతను చక్కటివాడు. ఆమెకి పాటలు రాయడం, చదవడం...."

"నిజంగా అలా అడిగితే" అని అందామనుకున్నాను. తెలీనిశక్తి నాలికమీదనే ఆ మాటల్ని ఆపింది. ఒక్కముక్క పలకకుండా శుద్ధమొద్దావతారంలా ఆమె ముందు నుంచున్నాను. 'గుడ్‌బై' అంది వాసంతే ఆఖరికి. అప్పుడు ఆమె కళ్ళు, ఆ చీకటిగోళాలు, పెద్దవై, మరీ పెద్దవై, నాకర్థం కాని దేదో చెబుతున్నట్లు కనిపించాయి ఆమెని తండ్రి దగ్గిర వొదిలి, నేను వచ్చేశాను. చాలాకాలం ఆ చూపులోని భావమేమిటో గ్రహించాలని ప్రయత్నించి విఫలుణ్ణయాను. ఇప్పుడిప్పుడే కాస్త తెలుస్తోంది.

—షు షాన్ ఎహ్
చందూర్ అనువాదాలు - 1957

